# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు 1958

సంపుటము 35 : : సంచిక 10

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1958


వైజయంతిమాల పద్మిని వీరిని
అత్యున్నత స్థాయిలో చూడండి
జెమినీ చిత్రం
విజయకోట
-తెలుగు-
వీరుడు
అక్టోబర్ 2 మొదలు ఆంధ్ర దేశ మంతటా....


# నిర్వేదము

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

ఎచ్చట నుంటివయ్య పరమేశ్వర! నీవిని కావ్యలోక మం
దిచ్చకువచ్చినట్లు విహరింపగ నీయక సేవకత్వమే
పుచ్చుకొనంగ నాజ్ఞ నిడబూన, రసాబ్ధులు నీపదమ్ములన్
విచ్చిన సన్నజాజియరవిందములన్ గొలువంగనెట్టులో!

భాగ్యముతోడ నీచరణ పద్మములన్ సతతమ్ము గొల్వగా
యోగ్యతఁగల్గ నిచ్చిన మహోజ్జ్వల నూతన సత్కవిత్వ సౌ
భాగ్యమునన్ ఉదాత్త రసవార్నిధి తేలెదగాని, వట్టిదా
ర్భాగ్య జగమ్ములన్ నిలువ వచ్చునె? యేకనిమేషమాత్రకై!

ఆశయముల్ హిమాలయ శిఖాగ్రములన్ బురుడించుగాని, పన్
ఏ శని పట్టెనో మొదటి కేనియు నించుక చేరలేక, నా
యాశల నీటగల్పుకొని యంధుడనై యిట కూలియుంటినో
ఈశ! పరేశ!! నన్ను కరుణించి యొసంగుము పూర్వసంస్కృతిన్!

ఈ యెద నొక్కమారు పరికింపుము, నాదు దురంత వేదనన్
వ్రాయగజాల పద్యముల స్వామి! అశక్తుడ నంచు తెల్పగా
నా యభిమానమున్ వదలినాడను లే!! యిక శంకలేల, నే
నీ యనురాగ గీతకమనీయసుధారసమానెదన్ ప్రభూ!

ఈ గుదిబండ దాల్చి యిక యెన్ని దినాలని జీవితమ్ము నే
లాగగలాడ తండ్రి? కనులం జలియించుచునుండె ప్రాణమే
లాగుననైన బ్రోవగ తలంపనిచో విమునమ్మ యేని నే
నాగగజాలనట్టి చలితాత్ముడ నైతినయా! పరాత్పరా!

ఆశరదిందు చంద్రికల ఆసికతాతలవేది జేరి నా
ఆశల నెల్ల నీకు తెలియంగ కవిత్వమునల్లి, అల్ల ఆ
కాశమునందు తారకల గానముతో శ్రుతిగల్పునట్టి భా
గ్యాశయ మబ్బునయ్య పరమాత్మ!! నిమేషపు జీవితమ్ములోన్!

భారతి

ఆశయహీన జీవితమె హాయిగ నున్నటు తోచు, వెఱ్ఱి యా
వేశము పెచ్చుమీఱ వినువీధిని సౌధము పైన సౌధముల్
కౌశల మొప్పగట్టితి సుఖమ్ముగ నుందమటంచు, నింతలో
రాశిగఁ జేసి యన్నిటి పరాత్పర! రంజిలుచుందు వాత్మలోన్॥

నీవే నేనయి నేను నీవయగుచున్ నిత్యప్రబోధమ్ముతో
భావావేశ రసైక జీవిత సముత్పన్న ప్రమోదమ్ముతో
నీ విశ్వమ్మున నుండు భాగ్య మది లేనేలేక యల్లాడు నే
నీ వాత్సల్యరసమ్ము నానుటకు తండ్రీ! ఎంతో కొట్టాడదన్॥

జీవిత మగ్గలం బగుట జీవికయంత్రమునందు జిక్కి, నా
నా విధమైన యాతనల నల్గి కృశించితి తండ్రీ! నూత్న సం
జీవిని నిచ్చి సంస్కృతి విశేష సమంచిత దివ్యమార్గ సం
భావితుఁ జేయవేడెద కృపారస వీక్షణా! సాధురక్షణా॥

నాదు జీవిత మనెడి విషాద గీతి
నీవు రచియించి నా కిడినావు గాని
శిథిల మాట ఆలాపన సేయజాల
దీ హృదయవీణ, నీవు ప్రేమించునటుల॥

ఎన్నటికైన వికసించు నీ మొడంద
మొగ్గయని తలంచితిగాని మోసపోతి
అమిత కఠిన కర్కశహృదయమ్ముతోడ
తొడిమవఱకును దీనిని త్రుంచినావు॥

ఏమి మూటగట్టెదవు? కానిమ్ము స్వామి!
ఆగిపోవను క్షణమాత్రమైన జన్మ—
ఈ విషాదాశ్రువులను జీవించువాడ
సతతమును నీదు నామసంస్మరణతోడ॥

లంటే ఒకరోజు, అది నీకు అర్థంకావాలంటే ఒక సంవత్సరం, దాన్ని నువ్వు ఆచరణలో పెట్టాలంటే ఒక శతాబ్దం పడుతుందిరా మై డియర్! కాబట్టి మూడుముక్కల్లో చెబుతాను విను. జీవించడమనేది ఒక కళ. ఆ కళని ఆధారం చేసుకుని మూడు ఉపకళలున్నాయి. ఒకటి అప్పుచెయ్యడం, రెండు అబద్ధాలాడడం, మూడు వేషభాషలు ప్రస్తుత నా నిరుద్యోగ నిర్వ్యాస నిరాహారదినాల్లో ఈ మూడింటిలోనూ గొప్ప ఎక్స్‌పర్ట్ నైపోయాననుకో

రంగ నిజం!

శేఖరం: నిజం. (విషాదంగా) రేయ్ చెయ్యమురా బ్రదర్ చెడ్డవాణి అనుకోకు మనలాంటి మధ్యతరగతి యువకులకి యింతకన్నా ఆస్కారం ఏముంది గౌరవంగా స్వేచ్ఛగా జీవించేందుకు మార్గాలు లేవు అలాగ అని స్వతంత్రాన్నీ హృదయాన్నీ చంపుకోను, ఆశయాల్నీ ఆకల్నీ కట్టకట్టి సైకు కాలవలో పారేసి జీతం డబ్బులకోసం బ్రతకడమనేది—మై గాడ్—నే సహించలేనురా

రంగ అవునుగాని నీకు అప్పు ఎవడిస్తాడంటీ? మాట మాయోపాయాల నికరమైన రూపిక సంపాదన వున్న వాకే పుట్టదు

శేఖరం అందుకే అప్పుచెయ్యడం కూడా ఒక కళ అన్నానురా మొసరి మాటవరసకి మన ఫ్రెండు గణపతిని ఎరుగుదువా?

రంగ తెలియకేం—ఆర్ అండ్ ఆర్ ఫరమ్‌లో పని చేస్తున్నాడుగా.

శేఖరం వాడికి మద్యంటే ఎంత గురి, ఎంత గౌరవమూ, ఎంత ఎక్స్‌పర్టూ ప్రయోజకుడివనీ తెలివైనవాడివనీ

రంగ: అవునవును పాపం వాడికి నేనంటే అమిత అభిమానం.

శేఖరం: అవునా! మొన్న నేనేం చేశానో తెల్సునా. అర్జంటు అవసరం వచ్చింది ఒక్క పాతిక వుంటే యివ్వరా బ్రదర్, మన రంగడు నా కివ్వవలసిన పాతిక నీకు వలియా వేస్తాను, పాపం వాణ్ణి ఈ వెళ్లాళ్ళ గోబాల్లో ప్రెస్ చెయ్యడం నా కిష్టం లేదురా అని ఓ పాతిక రూపాయలు సంపాదించాను

రంగ (తెల్లబోయి) నేను నీకివ్వాలనా? నీ మొహానికి నాకు అప్పుపెట్టే స్తోమతకూడా వుందా! ఏం గుండెలురా నీవి ఎంత అబద్ధం, పచ్చి వలని అబద్ధం

శేఖరం అబద్దం పల్లగా ఉండకూరా బాయ్ జర్మన్ సిల్వర్‌లా తళతళమని మెరుస్తూ నిమ్మ లోబడుకుంటుంది. సత్యం నిజంగా నల్లగా ఎక్కడో మూలపడి ఉంటుంది.

రంగ ఇంత ఘోరంగా ప్రవర్తిస్తావనుకోలేదురా.

శేఖ బంగారు పడకురా రంగడూ ఆపదలందు ధైర్యమున్నాడు ధర్మప్రహారి అనే అమెరికన్ పొయెట్

రంగ నేను వెళ్ళి గణపతికి నువ్వు చేసిన మోసం చెప్పేస్తాను

శేఖ చెప్పవూ! చెప్పినంత మాత్రాన తల తీసేస్తాడా ఏమిటి—ఇంతకీ స్నేహితులెందరా! ఓమనకాని బ్రదర్ ఒక్క అయిదు రూపాయలుంటే (చెయ్యి చాపుతాడు.)

రంగ (రంగారంగా) ఒరేయ్ నాకు మక్కా కొట్టుకున్నా వేమిటి

శేఖ: పాఠీ (నవ్వేస్తాడు) అలవాటు చొప్పున అడిగేను 'తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు, మంచేటికొమ్ము సాధింపవచ్చు కానీ చంపినా చచ్చినా రంగనాథునింనుండి కానీ రాలదెప్పుడు' అన్న లోకోక్తి ఊరికే పోతుందా

రంగ: థాంక్స్ డబ్బునెగర మరికి చాలా గట్టి అనుభవముంది మిత్రమా!

శేఖ (ఇటూ అటూ చూసి) ఒరేయ్ రంగడూ. ఇంక నువ్వెళ్లిపో

రంగ ఏం యిక్కడ నిలబడకూడదా.

శేఖ: ప్లీజ్ ఆ అమ్మాయి వచ్చే వేళయిందిరా.

రంగ అమ్మాయా! ఎవరా అమ్మాయి? ఎవరి అమ్మాయి తిడతిర సురాగదా లేమిటి. సవిస్తరంగా చెప్పు.

శేఖ సుచిత్ర

రంగ సుచిత్ర! లక్షాధికారి రామనాథంగారి అమ్మాయి!

శేఖ: ఎగ్జాక్ట్లీ.

రంగ : అయితే!

శేఖ ఇంకా నీవు తెలియదురా రంగడూ నువ్వే లోకంలో ఉంటున్నావో నాకు అర్థం కావటం లేదు. భవదీయుడు శేఖరంయొక్క జీవిత చరిత్రలోని యీ గొప్ప అధ్యాయాన్ని విస్మరించావని తెలిస్తే— భావి చరిత్రకారులు నిన్ను మెచ్చరురా

రంగ అసలు సంగతి ఏమిటో ఏడుద్దూ

శేఖ ఆ అమ్మాయిని నేను ప్రేమిస్తున్నాను. కాలేజీ వదలిన మరుక్షణంనుండీ యిదే మన జీవితాశయం నువ్వొక్కడివితప్ప యీ విషయం తెలియనివాడు మన దేశంలోనే లేడు

రంగ అదేదో ప్రేమించడం అనే పని చేస్తున్నావని తెలుసునుగాని నీ ప్రేమకి లక్ష్యమైన దురదృష్ట వంతురాలెవరో తెలియదు. అయినా, నువ్వెం దర్నీ ప్రేమించెయ్యొచ్చును ఖర్చు లేని వ్యవహారం.

శేఖ ఇదా నువ్వు చెప్పేది అసల నీకు ప్రేమంటే ఏమిటో తెలుసునా! ఆ ప్రేమించే తాపాలూ, హృదయమూ నీకు ఉన్నాయా? నువ్వు కీట్సునీ కృష్ణశాస్త్రినీ చదివావా? రాత్రిళ్ళు మల్లెపూలు వాసనచూస్తూ ఏడుస్తూ పక్కమీద దొర్లావా! పోనీ ఎప్పుడేనా చంద్రోపాలంభన అయినా చేశావా! కరుగట్టిన గుండెగల నువ్వు నా ప్రేమని విరసించడం అంధుడు సూర్య కాంతిని ఆక్షేపించినట్టు ఉంటుంది

రంగ నా మాటకేంకాని, ఏదేనా ఫలితం కనపడు తోందా!

శేఖ: ఆ అమ్మాయి చాలా సెట్టుగా వుంటోంది. ఎన్నో లవ్ లెటర్స్ వ్రాశాను. మా నాన్నకి చెబుతాను, మా ప్రిన్సిపాల్కి చూపిస్తాను అని బెదిరిస్తుంది కాని ఏ ఒక్కటి చెయ్యలేదు. అదిడికి మనం అంటే యిష్టమున్నట్టు అదే దాఖలా అనుకో

రంగ అనవసరంగా కొమ్మకూడా రద్దుచేస్కోవలసి వస్తుందనే భయంవలన ఆమె గప్ చిప్ గా ఊరుకుని వుంటుంది. కాక, అది నీ మీద ప్రేమగా భావిస్తే నీ కామన్ సెన్సుని గురించి సందేహించవలసి వస్తుంది.

శేఖ: స్త్రీ హృదయం నాకు బాగా తెలుసునురా మిస్టర్! ఆమె పైకి చూపే విముఖత, కఠినం వెనుక ఎంత ప్రేమవుందో, ఆమె ప్రవర్తనా, స్వభావమూ చెప్తూనే ఉన్నాయి. ఒరేయ్ బ్రదర్! ఒక్కొక్క అందం ఒక్కొక్క రకం వీణ అనుకో ఎవర్ని ఎలా మీటి పలికించాలో అదొక బ్రహ్మాండమైన కళ అందం మంచి గంధం చెక్కలాంటిది గంధం చెక్కని రాయగా రాయగా గంధాన్నిస్తుంది. అలాగే ఆడదాని చుట్టూ తిరగా తిరగా ఓ ఫైన్ మార్నింగున 'ఏమండోయ్ మిమ్మల్ని నేనూ ప్రేమించేస్తున్నాను' అని చటుక్కున అనే స్తుంది

రంగ నువ్వు వట్టిస్వాప్నికజీవివిరా శేఖరం కథలు వ్రాయడానికి, నాటకాల్లో వేషాలు వెయ్యడానికి పనికొస్తావుగాని లోకాన్ని అంచనా వెయ్య లేకపోతున్నావురా ఒకవేళ ఆ అమ్మాయి అంత బుద్ధిలేనిదై నీలాంటి లోఫర్ని ప్రేమించిందే అనుకో, వాళ్ళనాన్న నిన్ను ఓ పెయిర్ ఆఫ్ టాంగ్సు (Pair of tongs) తో ఓ పురుగుని ఏరివేసినట్టుగా ఏరి గోడ అవతలికి విసిరెయ్యడూ!

శేఖరం : ఒరేయ్ నువ్వు చూస్తూవుండు చూస్తూ ఎవడికీ జీవితంలో కోరుకున్న నిజమౌతుందనీ, అన్నీ కాకపోయినా కొన్ని అయినా సుఖాంతం అవుతాయనీ నమ్మకం పోతుందిరా పట్టి సినికల్ గా అయిపోతాడు చూసు ఈ అమ్మాయి రామనాథంగారి ఏకైకపుత్రిక అందులో గారాబు పట్టి, అర్ధరాత్రివేళ ఆమె లేచి ఇప్పుడు నాకు సూర్యకాంతి కావాలి అంటే ఈయన తక్షణం గగనమార్గంలోకిపోయి సూర్యభగవానుణ్ణి జబ్బపట్టుకు తీసుకు వచ్చేస్తాడంటే నమ్ము. అటువంటప్పుడు ఈమెని కాదనగలడా. అరెరె! ఆ అమ్మాయి యిటే వస్తోంది. ప్లీజ్ గెటవుట్.

రంగ ఏది ఆవిణ్ణి ఒక్కసారి చూడనియ్యి.

శేఖరం : ప్లీజ్. పోరా బాబూ (భుజం పుచ్చుకుని లాక్కుపోతూ) అబ్బబ్బ! యీ రోడ్డుమీదైనా

కదా ఈ కళ్లకి. ఈ ప్రకృతి అంతా వసంత కోకిలల్ని పిలుస్తున్నట్టు ఉంటుంది. పచ్చికతో కాలంలో కూడా ఇంత ప్రేమ సుద్దిదిలా అవుతుంది. ఆ చెప్పిన కవి యెవడో కాని

సుచిత్ర: పచ్చకామెర్ల వాడికి లోకం అంతా పచ్చగా కనపడుతుందిట.

శేఖరం మీ రలాగ తీసేస్తే నే నొప్పుకోను. ప్రేమ సృష్టికి మూలం ఆదిదంపతులు శివపార్వతుల దగ్గర్నుండి లైలామజ్నూ రోమియోజూలియెట్

సుచిత్ర (జేబుల్లో చేతులు పెట్టుకొని) మీ వాగ్ధోరణి విపరీతంగా ఉంది—

(టక్కున వెనక్కి తిరిగి వచ్చినదారినే కోపంగా వెళ్ళిపోతూంటుంది)

శేఖరం అరె! ఇంటికే వెళ్ళిపోతున్నారే.

సుచిత్ర మీలాంటి పెద్దమనుష్యులు దారులు కాస్తుంటే ఏమిటి చేసేది—ఛీ, పద్ధతి తెలియని ఊళ్ళు. నే నింటికి పోతాను.

శేఖరం (రెండు అడుగులు వేసి) మళ్ళీ ఇంతదూరం నడిచివెళతారా! పోనీ రిక్షా పిలవమన్నారా

సుచిత్ర (చురచుర చూస్తుంది)

శేఖరం కోపండేగా మీకి క్షమ ఏమిటి ఖర్మం మీ రిలా నడుస్తుంటే నాకు కాళ్లు నొప్పులు పెడుతున్నాయి మీరు దయచేసి వాయిస్తారని భయంకాని మిమ్మల్ని భుజాలమీద యెత్తుకు తీసుకుపోవాలని వుంది.

సుచిత్ర (ఫక్కున నవ్వి) మీకు కోపంటే భయం ఉందన్నమాట.

శేఖరం అనవిధయాం సుచిత్రాదేవి ఈ ప్రపంచంలో దేనికీ భయపడను—భయపడలేదు శాస్త్రజ్ఞులు ఒక్కరికే ఊరికి దూరంగా ఏకాంతంగా కూర్చుని గడిపిన రోజుకి భయపడలేదు దరిద్రానికి చావుకి భయపడలేదు కాని మీరంటే.

సుచిత్ర. (ఆశ్చర్యంగా) మీకు జంకొం ఏమీ లేదా.

శేఖరం: లేకేం సుచిత్రా—ఉన్నాయి పూర్వో అప్పులు.

సుచిత్ర: అంత పేదరికంలో ఉండి కాని సంపాదన లేని పరిస్థితిలో మీరు పెళ్ళి ఎందుకండీ?

శేఖరం ఎంత మాటన్నావు సుచిత్రా! ప్రేమ పెన్నిధి ప్రేమించుకొన్న వ్యక్తులకు ఈ సిరిసంపదలూ ఈ భోగభాగ్యాలూ తుచ్ఛాలు కావటండీ మీరు నేనూ, నాకు మీరూ ఉండగా మరింకేం కావాలి ఒకరి నడుంచుట్టూ ఒకరు చెయ్యివేసి ఒకరి కళ్లలోకి ఒకరు చూస్తూ ఎన్ని యుగాలైనా గడిపివెయ్యొచ్చును కదండీ.

సుచిత్ర ఔనులెండి. మీరు మీ మిత్రులదగ్గర ఒకటి రెండూ అప్పు చేస్తుంటే, నేను పొరుగమ్మ యిరుగమ్మలదగ్గర కొంచెం బియ్యం, ఉప్పూ, పప్పూ బదులు చేస్తుంటే—

శేఖరం మీ కేం సుచిత్రా. నువ్వు శ్రీమంతురాలివి.

సుచిత్ర అయితే నా ధనం ఆశించి నన్ను చేపట్టాలని చూస్తున్నారన్నమాట

శేఖరం: కాదు కాదు సుచిత్రా! ఇక్కడ మిమ్మల్ని, అక్కడ ఆగాఖాన్ ధనాన్ని, రాక్‌ఫెలర్ ఖజానాల్ని, ఫోర్డు మిలియన్సుని, నైజాం ధనాగార్ధంలో దాగిన బంగారుకడ్డీలని పెట్టి నీకేం కావాలని అంటే, సుచిత్రా అమితమైన్లు గొర్రె ధనాన్ని యిలాగ కాలితో తన్నేస్తాను. నేను గజానికి దాసుణ్నయితే, యిన్నాళ్ళు యీపూళ్లో అవస్థలు పడుతూ యిలా ఉంటానా

సుచిత్ర (దూర్తకంగా) మీలో ఎంత త్యాగశీలమూ సహనమూ ఉన్నాయండీ

శేఖరం ([illegible]) నాపరిచయం అయినా కొద్దీ మీరు క్రమంగా నాలోవున్న యితర సుగుణ సంపద కూడా తెలియవస్తుంది

సుచిత్ర కాని చూడండి మిస్టర్ నా జీవితవిధానం వేరు నాకు నిరంతరం, సౌఖ్యం, భోగం అలవాటు ఏం కోరినా అది కాళ్ళముంగు పడాలి మీరున్న ఉత్తరువులు నాలో లేవని వివారిస్తున్నాను చీరలు, నగలూ, కార్లూ, పౌడర్లూ —ఇవన్నీ నా కనీసపు అవసరాలు కనీసం వెయ్యిరూపాయలు సంపాదించగలిగినవాడైతే, నా వివాహానికి ఆశించవచ్చును మీకా అర్హతలు లేవని తెలుస్తూనే ఉంది మీరు పోషకులు వ్యవహారాల్ని భోంచేస్తూ మత్తుగా నిద్రపోయే ఓ రకం గొంగళిపురుగులు. ఇంక మీరు ప్రయత్నం విరమించడం ఓ కైమైన పని. నమస్తే. ఇక నన్ను విడిచిపెట్టండి.

(సుచిత్ర వెళ్ళిపోతుంది. శేఖరం స్తంభీభూతుడై కోపం కలవాడు కొంతసేపటికి తేరుకొని యిటూ ఆటూ ఆలోచనాసంభ్రమ మనస్కుడై తిరుగుతాడు.)

శేఖరం: నిజం ఎంగదు చెప్పావురా శేఖరం కోటా కడిగేసి గ్లామర్ ని కుడిచేసి ఎందుకు నీ నవ్వు పరిస్థితుల్ని ఆమెకి చెప్పావు. నా చిరిని నేనే నేస్సుకున్నాను నా ఆకలికి నేనే ఉరిత్రాడు బిగించాను ఎంతపని జరిగింది ఎంత సుళువుగా చేస్సాగా తన నిరసనని యీసడింపుని వ్యక్తం చేసింది ఇప్పుడేంచెయ్యను—

[శేఖరం నిష్క్రమిస్తాడు మరోవైపునుంచి తిరిగి సుచిత్రా, వెనకాల శేఖరమూ ప్రవేశిస్తారు ]

శేఖరం సుచిత్రా దేవీ! సుచిత్రా దేవీ!

సుచిత్ర (వెనక్కి తిరిగిచూస్తుంది )

శేఖరం ఇక్కడ యీ రోడుమీద, యీ ధూళిలో పారవేసుకొని వెళ్ళి పోతున్నారా?

సుచిత్ర (ఒళ్ళంతా చూసుకొని, చేతిసంచీ తెరచి చూసుకొని) అబ్బే, నేనేమీ పారవేసుకో లేదే!

శేఖరం పారవేశారు దేవి, యీదీనుడి గుండెకాయని నా తుచ్ఛంగా కఠినమైన మీ పాదాలతో తొక్కి వెళిపోతున్నారు

సుచిత్ర ఇంక కవిత్వం కట్టిపెట్టండి మాయిల్లు దగరకు వచ్చేసింది ప్లీజ్ గెటవే—

శేఖరం (ఒకటి రెండడుగులు వేసి) అయితే సుచిత్రాదేవి ఒక్క సలహా చెప్పండి మిమ్మల్ని ఇంక బాధించను

సుచిత్ర అయితే ఏమిటో చెప్పండి

శేఖరం జలం మంచిదా, ఎలక్ట్రిక్ తీగ మంచిదా, విషం మంచిదా?

సుచిత్ర ఎందుకూ

శేఖరం: సునాయాసంగా మరణించడానికి? శేఖరం అనే అబ్బాయి సుచిత్ర అనే అందమైన దయలేని అమ్మాయిచేత తిరస్కరింపబడి ఆత్మహత్య చేసుకోదలచాడు

సుచిత్ర (నవ్వుకొని, ఆలోచనగా) మీరు సైనేడ్ తెలియదూ?

శేఖరం (షాక్ అయి) ఏమిటీ!

సుచిత్ర పొటాషియం సైనేడ్ అనే ఒక విషం ఉంది లెండి. అది విషాల్లోకెల్లా రాజలాంటిది ఒక్క చుక్క నాలికమీద వేసుకుంటే వేసుకున్నట్టుగా గప్ చిప్ గా పోతారటండీ మనవూళ్ళో మెడికల్ స్టోర్సులో దొరుకుతుంది మరచిపోతారేమో పేరు నోట్ చేసుకోండి పొటాషియమ్ సైనేడ్

శేఖరం (గుండెల్ని పట్టుకుని) ఎంతమాట అన్నావు సుచిత్రా

సుచిత్ర ఇదే మాయిల్లు—గుడ్ బై

శేఖరం (గబుక్కున ఆమె చెయ్యిపట్టుకుని) సుచిత్రా దేవీ

సుచిత్ర (విదిలించుకుని) గెటవుట్

శేఖరం చచ్చినా మిమ్మల్ని వదలను

(సుచిత్రని అనుసరిస్తాడు తెర )

## రంగము-2

* * రామనాథంగారి యింట్లో ముందరి హాలు. ధనవంతుల యిళ్ళల్లో ఉండే అలంకరణ అంతా ఉంటుంది. ఒక పెద్ద డ్రాయరుముందు కూర్చుని రామనాథంగారు ఏవో ఫైల్సు చూస్తోంటాడు సంగీతం మేస్టరు 'పంతులు' పక్కగా నిలబడి ఉంటాడు. రామనాథంగారు ఫైల్సుమూసి ముందుకు వస్తాడు.

రామ: పాపింటికి వెళ్ళిన అమ్మాయీ రాలేదు. అద్దెలు వసూలుచేసి యిచ్చేస్తిన్న గుమాస్తా కూడా రాలేదు మేస్టారూ! ఈ కాలంలో సకాలంలో ఏమీ జరగడంలేదు సుమండీ అదే కాలం కాలమహిమ అంటే

పంతులు చిత్తం.

రామ: నిజంగా సకాలంలో అన్నీ పనులూ జరగడం కూడదు సుమండీ అప్పుడు జీవితం యాంత్రికంగా చప్పగా ఉంటుంది చూడండి. మీరున్నారు అమ్మాయికి సంగీతం చెప్పడానికి

రాము: అదంతా సెటిల్ అయిపోయుంటేనే అమ్మాయి స్వయంగా వరుణ్ణి ఎంచుకుంది

శేఖరం: సెటిల్ సెటిల్. (కూలబోయి కుర్చీని అనుకుంటాడు)

రాము: అదేం—అలా అయిపోయావేమిటి

శేఖరం: అబ్బే కొంచెం తిప్పిందండి అంతే—మిస్ సుచిత్రా దేవి కొంచెం వాటర్!

సుచిత్ర: వాటరేనా, మగ్గుకూడా కావాలా పాపం! (వెళుతుంది.)

రాము: కూర్చోవోయ్ శేఖరం దొడ్లో పని చేయిస్తున్నాను ఒకసారి చూచివస్తాను (వెళతాడు)

శేఖరం: (కుర్చీలో కూర్చుని మొహాన్ని చేతుల్లోకప్పుకుని) మైగాడ్.

సుచిత్ర: (నీళ్లతో ప్రవేశించి) ఇదిగో మిస్టర్ శేఖర్ టి.వి, వాటర్ (గ్లాసు బల్ల మీద పెడుతుంది)

శేఖరం: (కోపంగా చూసి గ్లాసుడునీళ్లూ గటగటా తాగేస్తాడు) హుం!

సుచిత్ర: (ఎదురుగా కూర్చుని) కాగితం కలం తీసుకోండి. నా మ్యారేజికి కావలసిన వస్తువుల లిస్టు చెబుతాను.

శేఖరం: (కదలడు)

సుచిత్ర: మీకే చెబుతూన్నది!

శేఖరం: (మాట్లాడకు కుర్చీ మరోపక్కకు త్రిప్పుకొని కూర్చుంటాడు)

సుచిత్ర: మీకు జీతం ఇచ్చేది ఎందుకో తెలుసా? చెప్పినట్లు చెయ్యడానికి

శేఖరం: నేను వ్రాయను

సుచిత్ర: ఏం?

శేఖరం: నా ఇష్టం

సుచిత్ర: మీయిష్టం మీయింటిదగ్గర అయితే ఉద్యోగము మానెయ్యండి.

శేఖరం: నాకు ఉద్యోగం ఇచ్చింది మీరు కాదుగా.

సుచిత్ర: ఎవరైతే నేం—ఇక్కడ నా మాట రాజాజ్ఞ. లేకపోతే డిస్మిస్ చేయిస్తాను

శేఖరం: వినాశ పుర్వ్యగం. మీరు చెప్పినట్లల్లా వినడానికి నేనేమీ తమ సొంతుణ్ని కాను. వస్తాడుగా ఓ దసట పదిరోజుల్లో తమ భర్తనంటూ! వాడికి పురమాయించు ఈ పనులన్నీ.

సుచిత్ర: (కోపంతో) యూ షటప్ నాకు కాబోయే భర్త నవరూనిపై కథ చాలాదూరం వెళుతుంది నా భర్త నాకు దైవసమానుడు మీ అంతస్థు తెలుసుకొని జాగ్రత్తగా మాట్లాడండి

శేఖరం: ఇక నాకు జాగ్రత్తలేదు నాకాలేదు నా గుండె మండిపోతోంది నేను మానవుణ్ని కాను, రాక్షసుణ్ని విప్లవకారిని సుచిత్రా! ఏ జీవిని నేనుసర్వస్వం అని ఆరాధించానో, ఏ దేవి నవ్వుకోసం, కటాక్షం కోసం తల్లడిల్లిపోయానో—అమె నన్ను ఓ అనాధపుశిలా పురుగులా విదిలించి పారేసింది నాకింక మంచీ చెడ్డా పాపం పుణ్యం వివక్షతలేదు ఎప్పటికైనా నా పగ తీర్చుకుంటాను నిన్నూ నీభర్తనీ కట్టకట్టి గోదావరిలో ముంచేస్తాను.

సుచిత్ర: (ఫక్కున నవ్వుతుంది)

రాము: (వస్తూ) ఎందుకమ్మా అలాగ నవ్వుతున్నావు

సుచిత్ర: 'తిరస్కరింపబడిన ప్రియుడు' అనే నాటకంలో పోర్షన్ చెబుతున్నారు నాన్నా వీరు వీరు నాటకాల్లో వేషాలు బాగా వేస్తారట

శేఖరం: అవునండి. మీ అమ్మాయి చెప్పిన నాటకం పట్టి విషాదాంతం అయిపోయిందండి. అందులోని హీరోయిన్ చాలా దుర్మార్గురాలండి వంచకురాలండి గోముఖ వ్యాఘ్రమండి

సుచిత్ర: హీరో అంతకన్నా దగాకోర్, దొంగ, లోఫర్

రాము: హీరో హీరోయిన్లు ఎటువంటి వాళ్లయితే నేం తల్లీ ఇంతకీ నాటకంకదా.

శేఖరం: వాస్తవిక జీవితంలో కూడా ఉంటారండి అటువంటి మోసకత్తెలు

సుచిత్ర: అటువంటి లేకివ్రాసిన కర్తలున్నా

రాము: నేను మీ ఇద్దరితో నూ ఏకీభవిస్తాను. సరేనా. (సుచిత్ర కోపంగా కూర్చుంటుంది. శేఖరం అంతకన్నా కోపంగా కూర్చొని టేబిలుమీద న్యూస్ పేపరు చదువుకున్నట్లుగా పట్టిస్తాడు. కాని అతని మొహంలోని బాధని దాచాలని ప్రయత్నం ఇదే సమయంలో గుమాస్తా పోదుయాలాలు వస్తాడు పేపరు అడ్డంగా ఉండడం వల్ల శేఖరాన్ని చూడలేదు, శేఖరమూ పోదుయాజాల్ని చూడడు)

శేఖరం: నా పేరు శేఖరం

సోము: యీపేరాది అద్దె ఎగ్గొట్టిన మహానుభావుడు వీరేనండి బాబూ

రాము: ఇతణ్ణా (తెల్లబోతాడు)

సోము: పైగా మీద మీదికి వస్తున్నాడు అయ్యా కొంచెం వుండి ఒక్క దెబ్బతో యితగాణ్ణి భూమ్మీదికి రప్పిస్తాను

సుచిత్ర: (ఇంతవరకూ వినోదంగా చూస్తోన్న సుచిత్ర పరిస్థితి దాటుతోందని గ్రహించి) వీరేనాన్నా వీరే

శేఖరం: రమణా ధంగాయా. నేను నిజం చెప్పేస్తున్నాను నేను మీ అమ్మాయిని సుచిత్రని యీ రెండేళ్ళనుండీ ప్రేమిస్తున్నాను ఆమె దయని సంపాదించాలని అన్నీ వదిలేసి యీ వూళ్లో వుండిపోయాను పలాయించి యీ సోమయ్యని మోసగించి ఏడాదినుంచీ అద్దె యివ్వకుండా కాలక్షేపం చేశాను నేను బి యే ప్యాసయ్యాను నేను దరిద్రుణ్ణి, లోభిర్ని నిజమే కాని ఒక్క అరగంటవరకూ సుచిత్రాదేవిగారు సమైనా శేరిం చాలనే ఆశ వుండేది కాని ఆ ఆశ యిప్పుడు సమూలంగా నాశనమయింది నా మోహాన్ని, నా అల్పత్వాన్ని మీరు ప్రత్యక్షంగా చూసికూడా నన్ను క్షమించి మీ అమ్మాయిని నా చేతుల్లో పెట్టారు. ఇన్నాళ్ళు నేను పడిన శ్రమకి మీ అమ్మాయి హృదయంలో సూదిమోపేవంతి చోటుకూడా సంపాదించుకోలేకపోయాను అందని ద్రాక్షకి అర్రులుచాచాను విఫలమైన యీ ప్రేమ నన్ను దహించివేస్తోంది నేను తెగించిన మనిషిని నాకు చావంటే భయం లేదు కాని యీ సోమయ్య నన్ను సుచిత్రాగారి ముందే అవమానించాడు అది మాత్రం సహించలేను ఈ సోమయ్యని చంపేసి మరీ చచ్చిపోతాను గుడ్ బై సుచిత్రాదేవి రారా సోమయ్యా (మీదికి వస్తాడు)

సోమయ్య: ఏం చేస్తావురా (మీదకొస్తాడు)

సుచిత్ర: (కంగారుగా) నాన్నా విను విను.

రాము: (బనిపించుకోక) ఇది యిల్లనుకున్నారా నడి బజారనుకున్నారా! (బల్ల గుద్దుతాడు)

సోము: ఆగండి బాబూ పిడిపాగాళ్ళ ఓ పది పోట్లు తగ్గించేస్తాను. మీరు చూస్తూ వుండండి.

(ఇద్దరూ కలియబడతారు. సుచిత్ర పేటిలుమీద యూశకి గ్రతిని ముందుకువచ్చి సోమయ్యనాలు చెతిమీద కొడుతుంది)

రాము: అమ్మాయ్ నువ్వేనా నీ తెగువ!

సోము: (విస్మయంతో) అమ్మాయిగారా! అబ్బ! నన్ను కొట్టకేమిటి తల్లీ

సుచిత్ర: ఇంకా దంపేద్దుమ జాగ్రత్త అయనెవరో తెలుసునా అయనే నాకు కాబోయే భర్త

రాము:
సోము:
శేఖరం: } — ఆ!

సుచిత్ర: (శేఖరం చెయ్యిపట్టుకుని) నేను నీకిదివరకు చెప్పింది వీరినే నాన్నా.

రాము: (నమ్మలేక) యితణ్ణా! అమ్మా, నువ్వు పొరపాటుపడటంలేదుకదా!

సుచిత్ర: నాన్నా వీరినిగురించి నీకు సరిగా తెలియదు బియ్యే ఫస్టు క్లాసులో ప్యాసయ్యారు నాన్నా.

రాము: (సందేహిస్తూ) సరిగా ఆలోచించుకున్నావా అమ్మా

సుచిత్ర: (లాలిస్తూ) ఆయన చాలా మంచివారు నాన్నా నా మాట కాదనకు నాన్నా.

రాము: (శేఖరంతో) ఇదిగో చూడు నీ తండ్రి పేరు.

శేఖరం: బ్రహ్మానందం అండి

రాము: బ్రహ్మానందంగా వుండాలోయ్ సరే నీ జీవితాశయం ఏమిటి?

శేఖరం: ఇంతవరకూ సుచిత్రాదేవిని వివాహం చేసుకోవడమేనండి

రాము: ఆ తర్వాత?

శేఖరం: సుచిత్రాదేవిని ప్రతిక్షణమూ సంతోషపరచి ఆమె కదలికలో కవిత్వాన్నీ కనుచూపులో స్వరాన్నీ సృష్టించడం

రాము: అంటే ఒక స్త్రీ కోసం నీ జీవితం అంకితం సమర్పిస్తున్నమాట

శేఖరం: నాకు కోపం తెప్పించకండి జమీందారుగారూ సుచిత్ర సామాన్య మానవస్త్రీ అంటే నేను సహించను.

రాము: భేష్ బాగా చెప్పావు ఇది నీ ప్రేమకి నిదర్శనం అనడానికి సందేహం లేదు. సరే, నీకు వ్యవసాయ భూములేమైనా వున్నాయా.

శేఖరం: చాలా వున్నాయండి.

# మర్యాదలు

## శ్రీ జానూతల వేంకటరామమూర్తి

‘చదువుకున్నందుకూ, ఉద్యోగాలు వెలిగిస్తున్నందుకూ మనం ఒకరికొకరైనా కొస్త సాయం చేస్తే దేశంలో ఇంతింత లావాటి సమస్యలు ఉత్పన్నం కావేమో! వచ్చినా సులభంగా తేలిపోతవి!’

‘ఔ నేమో!’ పరధ్యానంలో అనేశాను.

‘నే నెంతటి ముఖ్య విషయం చెబుతున్నానో నీవు అర్థం చేసుకునే స్థితిలో లోతిగా లేవని నమ్మ లేను. కట్నాలు ఇవ్వలేక పెండ్లి వాయిదా పడుతూంటే, చాటున కన్నీళ్లు తుడుచుకుంటూ ఎంతగా గిలగిలాడుతూ, ఎందరు తపించిపోతూ మగ్గిపోతు కృశించి పోతున్నారో ఎప్పుడైనా ఊహించడం జరిగిందా? నేను కళ్లారా చూశాను!’

‘లేదు!’ అంటూ కళ్లు వాడివైపుకు తిప్పాను. నందకుమార్ కళ్లలో ఎర్రటి జీరలు - రూపాలుగా ఉంటేనే కనిపించాయి. కండ్లు ఎర్రటి జీరలతో ఉంటం భాగ్యచిహ్నమని వాడు తరచు అనేవాడు. కుమార్ మళ్ళీ మొదలెట్టాడు, ‘కనీసం ప్రతియువకుడు కట్నం తీసుకోనని ఎందుకు తీర్మానం చేసుకోరాదూ?

‘ఈ విషయంలో ఒక చట్టంకూడా ఉంది. ఇది చాల పాతపాట! ఇంతకూ నీవు తీసుకోడం జరిగిందా?’

‘ఆఁ మనవాళ్ళు నిశ్చయించారు. రేపు ఇరవైరెండున నా పెండ్లి!’ అనేసి నందకుమార్, వెలుస్తున్నా దిక్కె వెళ్లిపోయాడు.

నేను ఆశ్చర్యంతో కూర్చుండిపోయాను!

అతి వైభవాలుగా వాడి పెండ్లి జరిగిపోయింది, కాబట్టి అసంఖ్యటంగా నేనూ చెప్పడంలేదు. పసుపు దాగులయిన బట్టలతో, శిరస్సునుండి విస్తృతం రాలుతూంటే చిరునవ్వులతో పరాపరి నా దగ్గిరకు వచ్చి, ‘ఎల్లా ఉందిరా?’ అన్నాడు నందకుమార్.

‘ఏమిటి’

‘నా పెళ్లాం!’ వాడి ముఖంలో గర్వం, కళ్లలో కాలూరు కలిగిలు మెరుస్తున్నాయి!

‘నీకు నచ్చిపోతుంది!’

ఇంతలో వాడి పెద్ద బావమరది గబుక్కున వచ్చి ‘ముఖ్యంగా మిమ్ముల అభినందిస్తున్నాము. మీ లాంటి మిత్రబృందం ఉండటంవల్లనే సంస్కారభావాలు, స్వేచ్ఛా ప్రయత్నాలూ కలుగుతుంటాయి. ఇల్లాంటి పుణ్యపురుషుని చూసినప్పుడు నా కండ్లు చెమ్మగిల్లుతుంటాయి. వీరిని నే నేమని అభినందించేది?’

‘చేసిన మెప్పు చాలదూ? కొరకా, నరవా మీ చెల్లెలు మాకుకోగలదు!’ అంటూ పైకి నేను అనలేదు.

నందకుమార్ ఉదాత్తమైన అతలో కాలం మావైపునుండి లోపలి వైపుకు ప్రసరించాయి. నేనూ అటే చూస్తున్నాను కాబట్టి, మెరుపులా తళుక్కున మెరిసి పోయిన వాడి మరదలు కనిపించింది.

‘మేము మాడండి ఎంతో కష్టపడాం! ఇక ఒకమో స్తరగా మంచో గలిగాము. ఇది సంతోషంగా ఉంది. మా నాన్న మాకోసం ఏమీ మిగల్చలేక పోయినా, ఇద్దరు పెండ్లాడాల్సిన చెల్లెళ్ళను వదిలి పోయాడు. ఎంత కష్టమో ఆలోచించండి! పొట్టకూ, బట్టకూ జరుపుకోడమే బ్రహ్మాండమవుతూంటే, ఇంకా పెళ్లిళ్లు ప్రయత్నించడం సామాన్యమా?’ అని అతడు ఒక నిముషం కూడా విరామం తీసుకోక, ‘నందకుమార్ విశాలహృదయుడు కావడంవల్లనే, ఎటువంటి అభిమతమైనా తన ఆశయాన్ని దక్కగా ప్రదర్శించి కృతార్థుడైనాడు!’ అని అతడు వెళ్ళిపోయాడు.

అతడి ధోరణి, తత్త్వమూ నేను అప్పుడు బాగా అర్థం చేసుకోలేకపోయాను.

‘మంచి బావమరిది నే సంపాదించావ్!’

‘అయినకేంలేవోయ్! గజెటెడ్ రాంకులేదనేగాని, సెంట్రల్‌లో అంత జీతంవచ్చే ఉద్యోగం!’

‘అయిన తమ్ముడో!’

‘తీర్పి చేస్తున్నాడు!’

లేక రాతిబొమ్మల్లా కూర్చున్నాను. వాడి ముఖంలోకి చూస్తూ నేను సంభాషణాన్ని కొనసాగించలేకపోయాను.

వాడిముఖంలో ఆరిపోతున్న దీపాలలాగ మళ్లీ మలినకాంతులు వ్యాపించి ఉన్నాయి.

చాలసేపటికి తెప్పరిల్లి, 'ఏమిటి ఇట్లా అయావు' అన్నాను.

'ఎట్లా అయ్యాననా? బాగానే వుందా లే! ఏం నీకు బాగా జరుగుతోందా? నేను జీవితంలో ఓడిపోయాను నాకు బంధువులు ఎందుకు లేమ్మను కున్నాను ఇవాళ నాక్కోసం పిచ్చివాడి నవుతున్నాను'

'అంటే?'

'ఇంక నేను తండ్రిని కాలేకున్నాను! అంటే రెండు జీవితాల గరిష్ఠ సమ్మేళనం నామీద ఉందన్నమాట! అన్నట్లు, నీవింకా పెండ్లిచేసుకోలేదేం?' అని మ్లానంగా నవ్వాడు నందకుమార్!

'చేసుకోవాలెనా?'

'నందకుమార్ గంభీరంగా చూస్తూ అన్నాడు. 'అది కేవలం వ్యక్తిగతమైందికాదు మునుపు నేను దీని వ్యక్తిగతమైందనే తలచాను కానీ నిజం కాగు నలుగురకూ, ముఖ్యంగా కుటుంబానికంతా సంబంధించిన విషయం అది!'

'అంటే?'

'ఆ విషయం చూడరాదూ? వీళ్ళంతా శత్రువులుగా ఎందుకు అయ్యారంటావు? కేవలం పెండ్లిని నా సొంతవిషయంగా అనుకుని ప్రవర్తించినందువల్ల కాదూ? నాగరాజు ఉద్యోగం చేసున్నాడా? పోనీ అత్తారింటికిపోయిందా? అన్నయ్య పిల్లాపాపలతో హాయిగా ఉన్నాడా, నాన్న ఇష్టంవచ్చిన దగ్గర నాగరత్న హాయిగా ఉన్నాదా? ఇంకా వీళ్ళెందుకు పగబూనడం? మొత్తమ్మీద నేను అన్ని విధాలా నష్టపోయాను!' అంటూ నందకుమార్ రెండు చేతుల్లోకి తల తీసుకున్నాడు

నాకు ఏమి చెప్పేందుకూ, చేసేందుకూ తోచలేదు మౌనంతో, సిగరెట్ల పొగలు చేస్తున్న వలయాలు చూస్తూ కూర్చున్నాను

ఎంతో సేపటికి బాగా ఆలోచించి, 'అయితే ఇప్పుడు నీకేమయింది నందా?' అంటూ అడిగాను.

'ఏమయిందా! ఇంకా ఏం కావాలి! నాకు ఒళ్లు బాగలేదు. కొన్ని రోజులు శారదకు వచ్చాయి. నాన్న అన్న రెండుత్తరాలు రాసినా, 'ఒళ్లు జాగ్రత్తగా చూసుకో! బరువు బిందెలు మోయకు! చిత్తడి నేలలో తిరిగేప్పుడు తప్పక చెప్పులు ఉపయోగించు' అంటూ ఉచిత సలహాలు ఓలిచారు, కాని 'వస్తున్నాను తీసుకువెళతాను' అంటూ రాయలేదు! తోలిమాలు కాదా, అపాటిజ్ఞానమూ లేకపోయింది! అన్నగారి కొమ్ముకు శారద ఇష్టపడలేదు అందువల్ల తీసుకువచ్చాను. నాగరాజు మమ్మల్ని చూసి పలుకులేక బజారుకు వెళ్ళిపోయాడు నాన్న ఇంట్లో లేడు! ఎప్పుడు వస్తాడో తెలీదు'

'శారదను ఇక్కడకు తీసుకవచ్చావా?'

'ఏమి చేయమంటావ్? అంటున్నా గత్యంతరం లేకపోయింది నా ఆరోగ్యం తిన్నగా ఉండటం లేదు ఎన్నిరావాలో అన్నీ వచ్చాయిరా తండ్రీ! ఇప్పుడు నాకో దారి చూడు!'

'ఎటువేపుకు!'

'ఇప్పుడుకూడా హాస్యాలు సాగిస్తావేరా? ఒడ్డునపడ్డ చేపలా గిలగిలాడుతున్నాను'

'అయితే ఏం కావాలంటావు?'

'నాన్న అగ్నిహోత్రి అవుతాడు, గుగ్గిలం మల్లే నాగరాజున్నాడు! వీళ్ళిద్దరి కలయికను ఊహించుకుంటేనే భయంగా వుంది'

'ఇదంతా నీ ఊహ!'

'ఊహూఁ'

ఆ విధంగా వాడు ఊహించేందుకూ ఆధారం ఉంది నాడిమీద ముఖ్యంగా ముసలాయన ఆశ పడ్డాడు వాడి పెండ్లి ఈ చేతో లేక ఆ చేతో కాని హైనూ ఒకింటివాన్ని చేయాలని ఆశపడ్డాడు

దగువుతున్న దగువులో కొంచెం మాటుం దొరకుతుందని నాగరాజూ పొంగిపోయాడు

శారదను ఏమీ లేకుండా పెళ్లాడ్డంతో అందరి ఊహలూ గాలికి చెదిరిపోయాయి!

కానీ, నాలుగేళ్ల తరువాత వచ్చిన నందకుమార్ మీద ముసలాయన ఇంకా కోపంగానే ఉంటాడా? ఇవాళ చలిమిడిముద్దలా దవ్వగా అణగివచ్చిన వీడిని ఆయన క్షమింపకపోతాడా? అందులో అత్యంత

# వార్నిష్లు - రంగులు తయారుచేయుట

శ్రీ అయ్యగారి సోమయాజి

ఆయిల్ & కలర్స్ ట్రేడ్స్ జర్నల్ వాల్యూం XLVII, నెంబరు 849 పేజి 393 లో ట్రేడ్ ఇండెక్స్, "హిందూదేశము - ఆ దేశములో దొరకు అవిశనూనె, సారాయి, కర్పూరతైలము, లక్క, అవి పూన నగరాలతో తయారు కాబడిన స్పిరిట్ వార్నిష్లు, నూనె వార్నిష్లు, రెండు రకముల వార్నిష్లను మనకు పంపగలదు." అని వ్రాసినారు.

సామాన్యముగా పలుచన చేయు వస్తువులు కూడ అవసరము. అవిశనూనె, రంగులు చక్కని పాళ్లలో కలిపినచో బ్రష్ తో వ్రాయుటకు వీలైనంత చిక్కగా నుండును గాన పల్చన చేయు, 'థిన్నరు,' అవసరము. మరియు చిక్కగ కాచినచో పెయింటు చక్కలోనికి ఇంకుటకు కూడ థిన్నరు సహాయపడును. థిన్నరుయొక్క భాగమునుబట్టి పెయింటును హెచ్చు లేక తక్కువ తళుకు గలదిగా చేయవచ్చును. పెయింట్లలో థిన్నరు హెచ్చుగా ఉన్నచో, పెయింటు ఆరిన తరువాత రంగు హెచ్చుగా వుండుటచేత, ఆరిన తరువాత ఫ్లాటు (Flat) గా వుండును

పెయింటు పొరను బలపరచి కాపాడుట, రంగు, ఒపాసిటీ నిచ్చుటయే రంగు (Pigment) యొక్క ముఖ్యమైనపని

వైట్ లెడ్, ముఖ్యముగా ఎఱ్ఱపీసం (గంగ సిందూరం) అవిశనూనె అతుకుటకు సహాయపడును. మరియు కాటుక మసి అవిశనూనెను ఆలస్యముగా ఆరునట్లు చేయును

వార్నిష్లో అవిశనూనెవల్ల యేర్పడు పొర రెసిన్ల ముఖ్యముగా కోపాల్సు చేర్చుటవల్ల బలపడును. చెట్టునుండి కారు జిగురు రెండు రకములు. 1. నీటిలో కరుగునవి. ఉదాహరణ — తుమ్మబంక. 2. నీటిలో కరగనివి ఉదాహరణ — కోపాల్సు వార్నిష్ గట్టి, తళుకు, మన్నిక అనుపారను ఇచ్చును. సామాన్లు, రైలుబళ్లు నగైరాలు అలంకరించుటకు వాడుదురు.

అవిశనూనెకు బదులుగా వార్నిష్తో తయారు కాబడిన పెయింట్లను 'ఎనేమిల్' పెయింట్లు అని పేరు. కేవలం నూనెతో యేర్పడు కోటింగు (పొర) కంటె ఎనేమిల్ కోటింగు హెచ్చు గట్టిదనము, చాలాకాలముండు తళుకుగల పొరనిచ్చును. ఇది వివిధ విధా అలంకరణములకు వాడుదురు

II అవసరమయ్యే వార్నిష్ ద్రవ్యములు. లిన్ సీడ్ ఆయిల్ (అవిశనూనె)-మనదేశపు అవిశనూనె బాయిల్డ్ నూనె తరువాత పేర్కొనదగినది సాల్వెంట్సుతో తీసిన నూనె పెయింట్సుకు పనికిరాదు.

తాజాగా గానుగఆడిన నూనెలో మడ్డియుండును నిల్వయుంచినచో, ఈ మడ్డి అడుగున దిగును మన దేశపు అవిశనూనె వేడిచేసినచో మరికొంత మడ్డి దిగును వార్నిష్కు వాడునూనెను కొన్ని సంవత్సరములు నిల్వయుంతురు

చాలాకాలం నిల్వయుంచిన నూనె చాలా పనులకు పనికివచ్చును తెల్లపెయింటుకు వాడు నూనెను కొంచెము సల్ఫ్యూరిక్ ద్రావకంతో బ్లీచ్ చేయుదురు.

బోయిల్డు ఆయిల్ 'మరిగించిన నూనె' అన్నంత మాత్రాన నూనెను నిజంగా మరిగించరు. ప్రస్తుతం నూనెను 150°C వరకుగాని అంతకంటె తక్కువ వేడికిగాని కాచుచు కొంచెము వేడినూనెలోనుంచి గాలిని పంపుదురు. కాచునప్పుడు, "డ్రైయర్సు"ను చేర్చుదురు ఇవి లినోలేట్సు & రెసినేట్సు ఆఫ్ లెడ్, మాంగనీసు కోబాల్టు సాల్ట్సు కూడా ఆరునట్లు చేయు డ్రైయర్సు.

మనదేశంలో మంచిరకం డబుల్ బోయిల్డు ఆయిల్ 6 గంటలలోను, పేల్ బోయిల్డు నూనె 10 గంటలలోను ఆరును—మరిగించిన నూనె పచ్చినూనె కంటె త్వరలో ఆరును-గట్టిపొర నిచ్చును.

దిగుమతి చేసిన నూనెకంటె సుప్రసిద్ధ దేశీయ కంపెనీలు అమ్ము నూనె శ్రేష్ఠతరము. కొన్ని నూనెలు

# జ్యోతిరవతరణము

శ్రీ వి. రామరాజు

వెలుగులు విచ్చుకొన్నవి, నవ పింఛ మనోజ్ఞమయూర నర్తనో
జ్జ్వల రుచిరంబులై, లలితచాలన హేలలు వాస్తరంగ శీ
తల మృదులంబులై, ఇవము తాకని శ్రీజలజాప్త కాంతి రే
ఖల తొలిజాలులై, ఉపసికట్టిన బంగరు టంచుచీరలై.

మూగిన మల్లె మొగ్గలను మాదిరిగా, లలితేంద్ర నీల మా
లా గలిత స్ఫురచ్చికుర రమ్యముగా, తెలినీటి ముత్తెముల్
తూగని పచ్చగడ్డికొన తూగులుగా, వెలుగుల్ వెలార్చె వాం
నీగరుదంచలాకలిత చిత్ర సువర్ణ ఘృణీకలాపముల్.

ఒక పదివేల శక్రధను రుజ్జ్వల కాంతులు మెట్లు మెట్లుగా
శకలితముల్, నభమ్ముపయి సాగిన నీలిమొయిళ్ళ నిండ వి
చ్చుకొనియె—దుఃఖభావ వివశుండగు జీవునియార్తి యద్భుతం
బు కనిన వేళ కప్పబడిపోవును తద్గత నూత్న శాక్తమై.

ఈ వెల్గుల్ జడివోలె వచ్చె-నిటులే యేకాంచెమో నేపు నా
లో విప్పారును వాపనల్, ఎడద్రవాల్చు బుద్ధిపోలున్ జలే
జావాప్తంబుల నేత్రచక్రముల వేలంచుల్ తుదల్ కంటి నీ
రై వ్రేలాడును వేదనానుభవ ముగ్ధాకార పర్యాప్తముల్.

ఏవో ఊహలు పెల్లగించుకొని యిట్లే వెల్గులో కాల నీ
మా వృత్తింబననో? పురావిదిత సౌఖ్యాస్వాద ముగ్ధంబులౌ
భావంబుల్ మలినంబులైచనెను, నా ప్రాణంబులన్ నూత్న వర్షా
విద్యుల్లతికా ముహుళ్ళ్చలనముల్ రమ్యార్థ సౌగంధ్యముల్

లలితేరమ్మద ప్రాణవీధికల హేలా జ్యోత్స్నికాకాశ కే
ళులు పారావతముల్ కలస్వనఝురీలోలమ్ములై సాగడిన్
పెల యేరై మృదుకాంతి యొక్కెడు మన స్సీమావధుల్ దాటిగ్రాం
బులకల్ గూర్చుచు బుద్ధి దేశమున గ్రమ్మున్ జీవనస్వాదువై

మత్తానేకప యానలై, సురనరిన్మంజు ప్రసూనాగ్రని
ర్యత్తారుణ్య మధుద్రవ స్స్రవాలు, చిత్తానంద సీమావధుల్
మొత్తం జూపుల అచ్చరల్ పరచిరా? మీనాళి పుచ్ఛచ్ఛవుల్
చిత్తాంభోరుహ నాళ కంపన మృదుస్నిగ్ధంబులౌ పైటలన్

చీకటులాక్రమించుకొని జీవన మందున మూలమూలలన్
ప్రాకి, సమస్త భావముల రమ్యత చంపి, క్షణక్షణమ్ము శో
కైక మహానుభావమనిపించుచును, జీవునిలోని కాంతిధా
రా కమనీయ మార్గవితరంబుగ నిల్చును యున్నతల్పులన్

కరగిన చీకటుల్ వెలుగుగా కనిపించును కొందరజ్ఞతా
పరమ నిధానమోహులకు — బంధుర కాంతులుమాసి పోవగా
కరకర చీకటుల్ విరియు, కన్నులు మూతపడంగ చేతన
త్వరథము గోతిలూలు తెగవంచిన విల్లుగ ముక్కలై చనున్

అపరోపనన్నమయూర్ద్రి సూర్య కిరణా హంకారమున్ వార్ధి పీ
చి పురస్తాడన చిత్రవల్గనములై చెల్వొందు కాంతిచ్ఛటల్
ఎపుడో జీవితమందు కాననయి నిల్చినిల్వకుండన్ నిమే
ష పదమ్మందు మనస్సు నవ్యసుషమా స్థానంబుగా దీర్చెడున్

ఈ కాలాణువుకోసమై బ్రతుకు లెన్నో యయ్యె నా జీవిత
ప్రాకారమ్మున, చీకటింబొరలు కృత్తానల్పముల్, కాంతి వ
ర్షా కాలంబరుదెంచె, నాయెడద ఈవర్షమ్మునిల్చున్ మనో
జ్ఞాకాశంబున తోడి స్పర్థపడి నవ్యాంబోధిగా నిల్వగా.

తెలియని సిగ్గుదొంతరలు దివ్యములైన పథాలలోన పా
ముల వలె జారిపోవ నవమోహన గీతము లాలపింతునా?
లలిత పయోధరాంచలముఃన్ నెలవంకలు దిద్ది తీర్తునా?
మలచి మనస్సులో వెలుగు మార్గములన్ పరుగుల్లుపెట్టనా?

పాట పూర్తయింది. పాటకి ప్రతిధ్వనిలా వయొలిన్ మీద రాగాలాపన సన్నగా వినిపిస్తోంది. విశ్వం తేరుకొని స్థైర్యంగా లోపలికి అడుగు వేశాడు. తలుపు చప్పుడు విని వసంత తలెత్తి విశ్వాన్ని చూసి ఆశ్చర్యపడి వయొలిన్ కింద పెట్టి లేచి నుంచుని "రవిగారా!" అంది.

విశ్వం చిరునవ్వు నవ్వాడు

"మీ పాటకి అడ్డొచ్చినట్టున్నాను"

"లేదండీ అలా కూర్చోండి." అంది వసంత

"ఇవాళ మా పరీక్షా ఫలితాలు వచ్చాయి. నేను సెకండ్ క్లాస్‌లో ప్యాసయాను" అన్నాడు. విశ్వం కుర్చీలో కూర్చుంటూ

"చాలా సంతోషమండి" అంది వసంత

"మరి మా టీపార్టీ సంగతేమిటి?" అన్నాడు విశ్వం కొంచెం చనువు తీసుకుని"

వసంత ముఖంలో విస్మయం తొంగిచూసింది "ఏం టీపార్టీ?" అంది ఆశ్చర్యంగా

"మర్చిపోయారన్నమాట. నేను ప్యాసైతే మీరు టీపార్టీ ఇస్తానన్నారుగా. మరి అందుకే వచ్చాను"

వసంత ముఖం ఎర్రబడ్డది ఆమెకి తన మాట జ్ఞాపకం వచ్చింది ముందు ఆ సంగతి తనకి జ్ఞాపకం రానందుకు ఆమెకి సిగ్గుగా ఉంది తను ఆమాట అన్నప్పుడు చాలా మనఃపూర్వకంగానే అన్నది తన ఇప్పటి ప్రవర్తన చూసి ఏమనుకున్నారో ఆయన!

విశ్వం ఆమె ముఖ కవళికల్ని గమనించాడు ఆమె జ్ఞాపకం మర్చిపోయి అందుకు సిగ్గుపడుతోందని గ్రహించాడు. తను అనవసరంగా ఆమె మనసుకి కష్టం కలిగించాడు.

"ఊరికే అన్నానండి. మీరు నిజముగా నేను ప్యాసయినట్టు చెప్పి పోదామని వచ్చాను." అన్నాడు విశ్వం తన తప్పును దిద్దుకోటానికి ప్రయత్నిస్తూ

వసంత చిరునవ్వు నవ్వుతూ, "పోటీను ఇచ్చి పోటానికి వచ్చారన్నమాట." అంది.

విశ్వం నవ్వాడు.

"ఇప్పుడే వస్తానుండండి" అని వసంత లోపలికి వెళ్లి కొంచెం సేపట్లో కాఫీ కప్పుతో తిరిగివచ్చి బల్ల మీద పెట్టింది.

"ఇప్పటికి ఇదే ఇవ్వగలనండీ. క్షమించాలి"

విశ్వం మొహమాట పడ్డాడు అప్పుడే బజార్లో తాగివస్తున్నానన్నాడు ఆమె బలవంతం చేసింది. మరేమీ అనకుండా కాఫీ తాగేడు అతను

"మీరు చాలా మంచివారండీ ఏదో అన్నానని అనుకోకుండా జ్ఞాపకం ఉంచుకుని వచ్చారు"

'మరి ఊరికే వచ్చేరాటని వదులుకోమంటారా?'

వసంత చిరునవ్వు నవ్వింది

"మీరు రిహార్సల్సుకి రావటం లేదేమండీ? రోజూ చూస్తున్నాను"

"నాకోసమా?"

"అవును"

"ఎందుకూ?"

వసంత తెల్లబోయింది అతనలా అడుగుతాడని ఆమె అనుకోలేదు ఒక క్షణం అతని ముఖంలోకి చూసి అంది

"రవిగారు కదూ? పాటభావాలు ఎలా ఉండాలో సలహా ఇస్తారని"

తన ఆశాలోచితమైన ప్రశ్నకి ఆమె ఇచ్చిన సమాధానం విశ్వానికి నచ్చింది

"నాకు నటనగురించి ఏమీ తెలియదు."

"తెలియకుండానే చెప్తున్నారన్నమాట"

విశ్వానికి ఏమనటానికీ తోచలేదు ఆలోచించి అన్నాడు

"మెచ్చుకోటానికి శాస్త్ర విషయాలు తెలియాలా?"

"మెచ్చుకోదలుచుకుంటే చాలు."

సంభాషణలోని అమాయకత్వానికి విశ్వం ఆమెని మనసులోనే పొగిడాడు

"పోన్లెండి మీకేమీ రాదంటారు సరే?"

ఆమె సమాధానం చెప్పకుండా చిన్నగా నవ్వి ఊరుకుంది.

"ఇంతకీ మీరు రిహార్సల్సుకి ఎందుకు రావటం లేదో చెప్పనే లేదు."

"సాధ్యం లేదు"

"ఏం?"

"ఆ వాతావరణం నాకు సరిపడదు."

"వాళ్లు మీ నాటకం పాడుచేస్తుంటే చూస్తూ ఊరుకుంటారా?"

"పాడుచేస్తున్నారా?"

"ఆ డైరెక్టర్ నాకు నచ్చడు"

"అయినా సలహాలివ్వటానికి నాటకాల విషయంలో నాకు అనుభవమేమీ లేదు."

"ఆలోచన ఉంటే చాలు. వాళ్లు ఎంతసేపటికీ ప్రజల అభిరుచుల్ని గురించే మాట్లాడుతారు. అలా ఉంటేగాని ప్రేక్షకులు మెచ్చరు అంటారు. సహజ నటనకి అస్కారమివ్వరు. ఇవన్నీ వాళ్లమీద ఫిర్యాదులుగా చెప్పటం లేదు. నా మనసుకి తోచినవి మీకు చెబుతున్నాను. అదీ మీరు కవిగారు కనక, రిహార్సల్స్‌కి రావటం లేదు కనక చెబుతున్నాను"

"నా నాటకం పాడయితే మీకేం నష్టం?"

వసంత అతనివైపు ఆలోచనగా చూసింది

"అంటే మీకు అందులో ఉత్సాహమేం లేదా?"

"లేదు"

"అయినా నాటకం పాడయితే మీకు చెడ్డ పేరు వస్తుంది."

"నా కింతకుముందు మంచి పేరుంటేగా!" అన్నాడు విశ్వం నవ్వుతూ

"సామాన్యంగా అందరూ మీకు మరేతుంటారు"

"మనుషుల రూపాలన్నీ ఒక్కమాదిరిగా ఉండనట్టే భావాలూనూ"

"నాటకం చెడిపోతే నాటక సంఘానికి పేరు ప్రతిష్ఠలేం ఉంటాయి?"

"పోనివ్వండి పాడుసంఘం"

"మీరు కూడా అందులో సభ్యులే కదూ?"

"సభ్యుడినే కానమ్మా. కాని దాంట్లో నాకు అభిరుచి లేదు అదీ కాక అందులోని వ్యక్తులంటే నాకు పడదు. వాళ్ళకి కావలసింది నాటకాలు కాదు. తైతక్కలాడి ఏదో పేరు తెచ్చుకోటం, డబ్బు చెయ్యటం, అవాకులూ చెవాకులూ వాగటం. కొత్తగా అందమైన నటి కనిపిస్తే ఆమె చుట్టూ తిరగటం. విరాళాలిచ్చిందే నోటికొచ్చినట్టు వాగటం. వీళ్ళకి నాటకాలూ, సభలూ ఎందుకు?"

వసంత అంతా విని విశ్వం ముఖంవైపు చూసింది. విసుగుదల, ఏహ్యభావం, కోపం అతని వదనంలో ప్రతిబింబిస్తున్నాయి.

"మీరు చెప్పింది నిజమే కాని వ్యక్తుల లోపాలు సంఘానికి వర్తింపచెయ్యగలరా?"

"వాళ్లు స్థాపించిందే ఆ సంఘం"

"పెద్దలైన వాళ్లు వెనకాల ఉన్నారుగా మీలాంటి వాళ్ళు కలగచేసుకొని బాగు చెయ్యటానికి ప్రయత్నించాలిగాని తొలగించుకుని పోదలిస్తే ఎలా?"

ఆమె మాటల్లో నిజం ఉందని ఒప్పుకున్నాడు విశ్వం

"ఈ సారి రిహార్సలుకు వస్తారా?"

"వీలయితే!" ఇంకా నవ్వుతూనే అన్నాడు.

"మీరు వస్తే నాకు ధైర్యంగా ఉంటుంది"

"ధైర్యమా! అంటే?" అన్నాడు అర్థం కాక.

"ఆనందేశ్వరరావూ, డైరెక్టరూ ఉన్నారే, వాళ్ల ప్రవర్తన నాకు నచ్చదండి."

కొంచెంసేపు మౌనంగా ఉండి అన్నాడు విశ్వం "పోనీ, నాటకంలో వెయ్యటం మానెయ్యరాదూ?"

"ఎలా?" అంది వసంత నిస్సహాయంగా

"బలవంతమేముంది. మీరేం డబ్బు తీసుకోటం లేదుగా"

"నిజమే కాని నా భవిష్యత్తు సంగతేమిటి?"

"ఈ నాటకంతోనే ఉందా మీ భవిష్యత్తంతా?"

"ఈ సంస్థకి పెద్దల సహకారం ఉంది ఈ నాటకంలో బాగా వేస్తే నటిగా పేరు తెచ్చుకుందామని ఉంది అవకాశం కూడా దొరకవచ్చు నాకు పెద్దదిక్కులేరు ఇంట్లో తింటూ కూర్చోటానికి డబ్బు లేదు మరి ఇంకే పని చెయ్యగలను?"

"పెళ్లి చేసుకోండి" అన్నాడు విశ్వం హాస్యానికి అన్నట్టుగా వసంత మాటాడలేదు. నిశ పద్ధతిగా నవ్వుతున్నాడు విశ్వం. ఆ మాట కొంతవరకు హాస్యమే కాని ఆ సమయంలో ఆమె ముఖంలో విసుగంటే ఏదో వేదన ప్రముఖంగా కనిపించిందతనికి. వసంత ఎంత సేపటికీ మాటాడ్లేదు పోవటం అతనికి అను

మానం కలిగించింది. తనమాటలు ఆమెని తప్పక గాయ పరచి ఉంటాయి. తెలివి తక్కువగా మాట్లాడాడు. ఆమెకి ఏదో సలహా ఇచ్చినట్టు ఘనంగా అన్నాడు. అందులో కొంత హాస్యధోరణి ఉన్నా ఆ అమూల్యమైన సలహా ఇవ్వటానికి తనకే కావాలా!

"ఏమనుకోకండి. తెలియక అన్నాను," అన్నాడు విశ్వం తొందరపడుతున్నట్టు

వసంత ఓ నవ్వు పెదవులదాకా తెచ్చుకొంది. కొద్దిక్షణాలు మళ్ళీ నిశ్శబ్దంగా గడిచాయి.

"మరి నేను వెళ్తాను" అన్నాడు విశ్వం, కుర్చీలోంచి లేచి నుంచుని

"మా ఇంట్లో విందుచేస్తే వస్తారా?" అంది వసంత.

"విందా!" ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూశాడతను.

"అభ్యంతరం ఉంటుందా?"

"అభ్యంతరమా? ఎందుకూ?.. అబ్బే. ఏమీ లేదు కాని. కాని ఇప్పుడు కాదులెండి. మరో సారి ఎప్పుడైనా" అన్నాడు విశ్వం.

"అంటే ఎప్పుడు?"

విశ్వానికి ఏం చెయ్యటానికీ తోచలేదు. "నేను చెబుతాగా," అని తప్పించుకునే ధోరణిలో అన్నాడు.

వసంత ఇంకేం అనలేదు. విశ్వం మరెక్కడికీ వెళ్ళకుండా సరాసరి ఇంటికి వచ్చాడు. వసంత! అనాదిగా మానవుని హృదయంలో వేళ్లు పాతుకొనివున్న సాంఘిక దురాచారానికి బాధితురాలు! ఆమెనుచూస్తే తనకి జాలి వేస్తోంది.

ఇంట్లోకి విశ్వం అడుగుపెట్టగానే వెంకట్రామయ్యగారి స్వరం వినిపించింది. అప్పుడే వస్తున్న విశ్వాన్ని చూసి ఆయన సంతోషంగా అన్నాడు: "ఏరోయ్, పరీక్షల్లో పాసగావే. నీకు మంచి ప్రజెంట్ ఇవ్వాలిసిందే!"

విశ్వం చిరునవ్వుతో లోపలికి ప్రవేశించి, "ఎప్పుడు వచ్చావు మామయ్యా, ఏమిటి విశేషాలు?" అని అడిగాడు.

"ఇప్పుడేరా. విజయవాడ పనిమీద వచ్చాను. పేపరుచూస్తే నీ రిజల్ట్సు కనిపించాయి. ఎలాగో ఇంత దూరం వచ్చానుగదా, నీకు కంగ్రాట్యులేషన్స్ చెప్పిపోదామని ఇలా వచ్చాను," అన్నాడాయన.

అయితే ఆయన వచ్చిన అసలు విషయం మధ్యాహ్నం భోజనం అయినతరవాత కబురులో బయటపడ్డది.

జానకిని తన కివ్వాలని ఆయన ఉద్దేశం. ఆ మాట అప్పుడప్పుడు తన చెవిని పడుతూనే ఉంది. కాని తీవ్రంగా ఆమాట ఆలోచించలేదు ఇంతవరకూ. ఇప్పుడు విషయం తేల్చమని మామయ్య అంటున్నాడు.

జానకి!

ఆమె అంటే తన కెంతో అభిమానం.

కాని ఈ దృక్పథంలోంచి ఆమెని ఎప్పుడూ చూడలేదు.

తను జానకిని పెళ్ళిచేసుకోటంలో ఏదో అసహజత్వం ఉందనిపించింది విశ్వానికి. తను ఆమెని చిన్నతనంనుంచీ ఎరిగినవాడు. ఆమెతో ఆడుకున్నాడు. కవ్వించాడు, ఎగతాళి చేశాడు. కలిసి అల్లరిచేశారు. ఆమె తనకి ఆత్మీయురాలు, స్నేహితురాలు.

అప్పటినించీ ఇప్పటివరకూ తనకి ఆమె అంటే అదే దృష్టి.

కాని ఇప్పుడు మరో సంబంధం ఏర్పడటానికి సంప్రదింపులు జరుగుతున్నాయి. ఆమెని వివాహం చేసుకుంటే తను సుఖపడగలడా! ఆమె సుఖపడ గలదా! జానకి అభిప్రాయ మేమిటో? మామయ్య జానకిని అడిగిఉండడు. కొన్నిట్లో మామయ్య అభిప్రాయాలు తనకి నచ్చవు, తన ఇష్టం వచ్చినట్టు చేస్తాడేగాని సలహాగాని, అభిప్రాయంగాని అడగడు. వసు పెళ్ళప్పుడే మామయ్యకి కొంచెం కోపం వచ్చింది ఈడుకాదని నాన్న చెప్పాక, మరి కివ్వటానికి వాడికివ్వటం నాన్న కిష్టంలేదు.

విశ్వం ఆలోచించి "ఉద్యోగమైనతరవాత చూద్దాంలే మామయ్యా" అన్నాడు. ఆయనకి నచ్చక పోయినా ఆ సమయంలో ఏమీ అనక వెళ్ళిపోయాడు

## 9

విశ్వం రచించిన నాటిక ఆ రాత్రి ప్రదర్శిస్తున్నారు. నాటిక పేరు "మహారాజ పోషకులు" ప్రముఖులు చాలామంది విచ్చేశారు. నాటకం

ఓలాభులపాటిచక్కని తలపాగా' సవరించుకొంటూ రంగంమీదికి వచ్చి నిలబడ్డాడు

మొదలాపె సాగింది నరకి విసుగ్గా ముద్ర పట్టలేకుండగా రెడ్డి అరిచాడు

"ఇటు ఇటు"

మీ తావా కూర్పుకోలేరు. అందరూ తమకే అభినయించాలన్నారు.

ముద్ర పట్టకుండా నే నరకి వెనక్కి తిరిగిపోయింది ఎవరికి అభినయించాలి? ఎవరు గొప్ప? ఎవరు అల్పులు?

ప్రేక్షకుల సహాయం కోరారు తమని అభినయించేవారంతా తమ వెనక నిలబడాలన్నారు

ప్రేక్షకులు ఒక్కొక్కరూ అలాగే నిలబడి పోగాను బారులు తీర్చి

చిత్ర మేమంటే రూపురేఖల్లో, వేషభాషల్లో ఒకే పోలికగలవాడు మాత్రమే తమ తమ వరసల్లో ఉన్నారు

తెరపడ్డది - మొదటి రంగం సమాప్తమైంది లైట్లు వెలిగాయి

ప్రేక్షకుల స్థానాల్లో మొదటి వరస కూర్చున్న పెద్దల్లో సందేహం కలిగింది గుసగుసలు ప్రారంభమయ్యాయి రానురాను గుసగుసలు వాగ్వివాదాలుగా మారాయి పెద పెదగా కేకలు వేసుకుంటున్నారు ఉద్రేకాలు పెరిగిపోగాయి ఈ వాదావివాదం వెనకస్థానాల్లో వాళ్ళకి కూడా పాకింది. హాలంతా కేకలతో మారుమోగుతూ గందరగోళంగా ఉంది థియేటర్ యాజమానులు థియేటరు పోలీసుల్ని పిలిపించారు వాళ్ళు జనాన్ని సద్దుబాటుకి ప్రయత్నించారు కాని పోలీసుల్ని చూడగానే ప్రేక్షక జనసమూహం మరింత రెచ్చిపోయింది కొందరు గ్రీన్ రూమ్‌పై పరిగెత్తారు.

"ఈ నాటకం ఆడటానికి వీల్లేదు" అన్నారు కుంచితంగా కొందరు.

"అది తీరలిపిందే!" అన్నారు మరికొందరు మరింత పట్టుదలతో.

చేతులు కలిపేసిన వచ్చింది. పోలీసులు కేక చేసుకున్నారు నాటక ప్రదర్శనం ఆగిపోయింది పోలీసులు చెయ్యగలిగిందలా నాటకసంఘంవారి కెవరికి అపాయం జరక్కుండా కాపలా కాయటమే. నాటకం ఆగిపోయిందనగానే కొందరు శాంతించి ఇంటిదోవ పట్టారు. వాగ్వాదాలు తగ్గాయి జనం వెళ్ళిపోసాగారు.

ఈ అవాంతరానికి విశ్వం విశ్వసుడై గ్రీన్ రూమ్‌లో తల చేతుల్లో పెట్టుకుని కూర్చున్నాడు. నరకి వేషం కట్టిన వసంత అలిసిపోయి వాలిపోయిన ముఖంతో కుర్చీలో కూలబడ్డది. తన ప్రథమ ప్రయత్నం ఇలా పరిణమించినందుకు నిరాశపడిపోయి నాటక సంఘంలోని సభ్యులు, పాత్రధారులు రంగస్థలంమీద పరిసరాలు చక్కబెట్టుకుంటూ నిస్పృహతో పనులు చెయ్యసాగారు

గ్రీన్ రూమ్‌లో ఉన్న విశ్వం గొణిగాడు.

"నాటక సంఘంలో నేను సభ్యుణిగా చేరి ఉండకపోతే బాగుండేది కనీసం నేను నాటకం రచయితనన్నప్పుడు వాళ్ళు నన్ను వొదిలివేసినా సరిపోయేది ఎంత గందరగోళం! నా సంగతి అలా ఉండండి. పాపం, వాళ్ళ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరయింది ఎంత అవస్థపడ్డారు! ఎంత నష్టపోయారు!"

"ఇటువంటి నాటకం ఎందుకు రాశారు?" అంది వసంత

"బుద్ధి గడ్డితిని"

అతనిలా పశ్చాత్తాప పడటం చూసి వసంతకి జాలి వేసింది. కొంచెం అనునయ పూర్వకంగా అంది

"అయినా ఇందులో అంత కొంపలంటుకునే విషయం మేముంది? అనాలోచితంగా ప్రేక్షకులు తొందరపడారు గాని"

"ఉంది లేకపోలేదు కాని ఇలా మూర్ఖంగా ప్రవర్తిస్తారని నే ననుకోలేదు ఇంకా నయం పూర్తిగా నాటకం చూస్తే నన్ను ఉరితీసే వాళ్ళేమో!"

"వాళ్ళు సరిగా అర్థం చేసుకోలేదండీ"

"సహ్యాద్రి కాళిదాసు 'అరసికేషు కవిత్వ నివేదనం శిరసిమాలిఖ' అన్నాడు కుల తత్వం మీద కున్మితమైన వ్యంగ్య విమర్శచేస్తే కర్తలూ, కర్మలూ మారితే సహించెయ్యరు! నే నేర్చి కానాలని తెలియదు, తెమ్మలేరు. అభిప్రాయ ప్రకటన చేసే స్వేచ్ఛ ఇంకా మన దేశానికి రాలేదు"

వసంత అతనివైపు జాలిగా చూసింది

"అందరూ మీలాంటివాళ్ళే ఉంటారా?"

అందరికీ అత్యంతాశ్చర్యం కలిగించింది. ఎవరైనా ఈ ప్రసక్తి అతనిముందు తెస్తే అదేమీ ఘనకార్యం కాదన్నట్టు మాట్లాడతాడు.

ఇలాంటివే కొన్ని చెప్పుకోదగ్గ మేళ్ళు చెయ్యటంవల్ల అతనంటే ఊరివాళ్ళకి అభిమానం ఏర్పడ్డది. చిత్రమేమంటే ఇలా ఊళ్లో తనని అభిమానిస్తున్నారనే విషయం అతని ఆలోచనలోకి రాదు. ఆ విషయం అతనికి తెలియదనికాదు. ఒక విధమైన విరక్తత అతని ముఖంలో ద్యోతకమవుతుంది. ఓసారి సభావేశంలో సూరిని గూర్చి ఈ మనస్తత్వ ఎవరో ప్రశంసా వాక్యాలు పలికితే, వెంటనే లేచి అన్నాడు.

"నేనూ ఊరివాళ్ళలో ఒకణ్ణి. ఒకవేళ నేనేదైనా చేస్తే అందులో ఆశ్చర్యమేం లేదు. నాకు అవసరమనిపించిన పనులే నేను చేశాను. ఇందులో ప్రశంసించటానికేం లేదు"

మరోక వ్యక్తి ఈ మాటలంటే మర్యాదకోసం, సభ్యతకోసం అన్నాడని సులభంగానే ఊహించేవాళ్ళు జనం. కాని ఆ మాటలు అన్నవాడు సూరి. ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని తనెప్పుడు సూచించే మాట ఒక్కటీ పలికినా ముఖం చిట్లించుకుని చిరాకుపడే ఒకే వ్యక్తి. పొద్దస్తమానమూ పని వాళ్ళతో పాటు ఒళ్ళు వొంచి చాకిరిచేసే ఆసామీ. అజమాయిషీ పేరుతో నడుంమీద చేతులు ఆనించి నిక్కులు చూస్తూ నిలబడే కర్ర పెత్తనదారు కాదు సూరి.

పడమటి ఆకాశం ఎర్రబారుతోంది. ఆ సమయంలో ఓ వ్యక్తి సూరిదగ్గరికివచ్చి 'నమస్తే' అన్నాడు. దగ్గర్లో ఉన్న చిరిచాపలాగి "కూర్చోండి" అన్నాడు. సూరి, ఆ వ్యక్తిని ఆపాదమస్తకం చూసి

"నేను కరణంగారి దగ్గర్నుంచి వస్తున్నానండీ" కూర్చుంటూ అన్నాడతను.

"అలాగా!"

"నా పేరు వెంకటపతి. ఈ సంవత్సరం నేను బి. ఏ. ప్యాసయాను. సూరిగారు మీరేకదూ?"

"అవునండీ" అంటూ సూరి దగ్గర్లో ఉన్న కుండ మరచెంబులోని నీళ్లు పంచపాత్రలో పోసి వెంకటపతి కిచ్చాడు. ఆ చల్లటి మంచినీళ్లు తాగాక అతను తను వచ్చినపని చెప్పాడు.

"కాలేజీలో చదువుతున్నప్పుడు నేను సంఘసేవ చేసేవాడినండీ. కాలేజీ సాంఘిక సేవాసమితి సభ్యుణ్ణి. మొన్న ఆమధ్యన ఈ ఊరి మట్టిరోడ్డుమీద కంకర వేసిన బృందంలో నేనుకూడా ఉన్నాను. ఈ ఊళ్లో నాకు చేతనైనంతవరకు కొన్నాళ్ళు సంఘసేవ చెయ్యాలని ఉందండీ"

"మంచిది" అన్నాడు సూరి

"ఏంచేస్తే బాగుంటుందంటారు?"

"నా కా విషయాలు తెలియవే"

"మీకు తెలియకపోతే ఇంకెవరికి తెలుస్తాయి?"

"అదేమిటలా అంటారు?"

"కరణంగారు మీ విషయమంతా చెప్పారు. మీ సలహా తీసుకుని ఏదైనా చేస్తే బాగుంటుందని ఆయన చెప్పిన మీదటే మీ దగ్గర కొచ్చాను. మీరు సహాయపడతారని ఆశిస్తున్నాను"

"నావల్ల సహాయం జరిగే వీలుంటే సంతోషంగా చేస్తాను. కాని నేనేం చెయ్యగలనో నాకే తెలియదు. మీ కార్యక్రమ మేమిటో సెలవివ్వండి"

"అది తయారు చెయ్యటానికే మీ సలహా అడుగుతున్నాను"

సూరి ఆలోచించాడు. ఆ క్షణంలో అవసరాన్నిబట్టి తోచిందేదో చెయ్యటమే గాని తనింతవరకూ ఫలానా ఫలానా వ్యవహారాలు ఫలానా విధంగా చెయ్యాలని ఆలోచించి ఆ కార్యక్రమం ప్రకారం నడపటం ఎరగడు

"మీరీ ఊళ్లో స్థిరపడిపోతారా?"

"ఎబ్బే, లేదండీ."

"ఎన్నాళ్లుంటారు?"

"బి. ఏ. ప్యాసయాను కదండీ. ఏదైనా ఉద్యోగం వస్తే వెళ్లిపోతాను. ఈ లోపల వీలైనంతవరకూ నలుగురికీ పనికొచ్చే పనేదైనా చెయ్యాలని ఉబలాటం."

సూరి పొడిగా నవ్వాడు

"చెయ్యవచ్చు. దానికేం. కాని అర్థాంతరంగా వెళ్ళిపోతే ఏంలాభం?"

"ఎవరికి?" అన్నాడు వెంకటపతి.

"ఊరికీ, మీకూ కూడా."

"జరిగినంత పనే జరుగుతుంది."

"అయితే సరే" అన్నాడు సూరి

"సూరి దగ్గిర్నుంచి సూచన లేని వొచ్చేటం లేనందువల్ల వెంకటపతే కొన్ని ఆలోచనలు వెలిబుచ్చాడు

"యువజనులకి రాత్రిబడీ, ఆరోగ్యసూత్రాల ప్రచారమూ, వాటి ఆచరణా, సమిష్టి శ్రమదానమూ మొదలైనవి ప్రారంభిస్తే బాగుంటుం దనుకుంటాను."

"అలాగే !"

వెంకటపతి ఉత్సాహంగా కార్యక్రమం ప్రారంభించాడు మొదటిరోజు పెద్దల్ని సమావేశపరిచి తన అభిప్రాయాలు వెలిబుచ్చాడు కొందరు యువకులు ముందు కొచ్చారు. తోడ్పాటు ఇస్తామన్నారు. రాత్రిబడి నెలకొల్పబడి పరిసరాలనీ, ఊరినీ ఎలా శుభ్రంగా ఉంచాలో ప్రచారం జరుగుతోంది. ఉద్యానవనం వెయ్యటానికి శ్రమదానం ప్రారంభం చేశారు కొందరు యువకులు.

ఈ పనులన్నీ కొత్తగా వింతగా ఉన్నాయి జనానికి కొద్ది రోజుల తరవాత ఈ విషయం పాతబడి మామూలు వ్యవహార మైంది

మొదట్లో ఉత్సాహంగా రాత్రి బడిలో చేరిన యువకులు రానురాను పల్చబడ్డారు హాజరు తగ్గిపోతోంది రోజురోజుకీ

ఆరోగ్య సూత్రాలు ఆచరణలో పెట్టడానికి బద్ధకం వేస్తోంది జనానికి

పగలంతా పొద్దు విరామములేని పొలాల్లో పనిచేసిన తరవాత ఇంకా ఈ శ్రమదానానికి ఓపిక మా కెక్కడి దనిపాగారు ఆరంభించారులు

"మా ఊళ్ళోకూడా చదువుకున్నవా ళున్నారు లెండి" అని మొహం ఎదుటనే వెంకటపతితో అన్నారు కొంతమంది.

"ఒకళ్ళు చెప్పాలిసింది, మేము వినాలిసింది ఏముంటాయిలెండి కొత్తగా" అన్నారు సమావేశాలకి హాజరు కావటం ఇష్టంలేక మానుకున్న జనం

"ఇదంతా మీకోసమే." అన్నాడు వెంకటపతి కోపంగా, విసుగ్గా.

"మాకోసం మీకంత శ్రమ దేనికెండి!" అని ఎత్తిపొడిచారు పల్లె యువకులు.

"ఇక్కడకే నా చేస్తే మీకేనా ఉద్యోగం వస్తుం దిట, మాకు తెలుసు" అన్నారు దేశ వ్యవహారాల్లో మిడిమిడి జ్ఞానం సంపాదించిన కొందరు. వెంకటపతి చిరాకేసింది. తను నిజాయితీతో వాళ్ళని బాగుచేద్దా మనీ, చేతైనంతవరకు పైకి లాగుదామనీ ప్రయత్నిస్తే ఇదా ప్రతిఫలం! ఈ కొంపలి ప్రజలకు అహంకారం ఎక్కువ. వాళ్లలో ఏకోశానా అర్థం చేసుకునే శక్తి లేదు తను ఈ ఊరు విడిచిపెట్టేసి ఇంకో ఊరు వెళ్ళటం ఉత్తమం ఇక్కడ తన కాలం వృథా చెయ్యకూడదు.

వెంకటపతి ఉదారం ఎత్తేగాడు కోనపల్లి గ్రామం విడిచి. వెళ్ళిపోయేముందు సూరిని కలుసుకుని వాళ్ళందర్నీ వదాముదా తీసేసి తన కార్యక్రమం తనని అర్థం చేసుకోగల మరో పల్లెలో కొనసాగిస్తానని చెప్పాడు.

అసలు అటువంటిపల్లె ఉంటుందా?" అన్నాడు సూరి

"నేను నిరాశావాదిని కాను మీరు పల్లెటూరి వారయి ఉండీ పల్లె ప్రజల్ని అర్థం చేసుకున్నటు లేరు. వాళ్లలో శక్తి, ఉత్సాహమూ, పట్టుదలా లేకనా మీర నేది?"

"అది కాదు మిమ్మల్ని అర్థం చేసుకోగల పల్లె ఉంటుందా అని"

వెంకటపతి కాసేపు ఆలోచించి అనుమానంగా సూరివైపు చూసి అన్నాడు.

"అయితే లోపం నాదే నంటా మీరనటం?"

"లోపమంటంగతి కాదండీ మిమ్మల్ని గ్రహించి తెలుసుకోటానికి వాళ్ళకి అవకాశం తక్కువ కదూ?"

"మాలాటిమనిషిని అర్థంచేసుకోటానికి ఎంత వ్యవధి కావాలండీ?"

"మీలాంటి మనిషిని మీరు సులభంగా అర్థం చేసుకోగలరు. నేనూ అంతే మా ఊరివాళ్లూ అంతే. కాని మీరు మాలో ఒకరు కారుగా."

వెంకటపతి కనుబొమలు చిట్లించి సూరివైపు చూసి వినోదంగా అన్నాడు: "చదువుకున్నవాళ్ళు, మీకుకూడా ప్రాంతీయ దురభిమానం ఉందన్నమాట."

సూరి ఆశ్చర్యపోయి వెంకటపతివైపు చూశాడు. అతనేదో అనబోయి మళ్ళీ వెంటనే మాటమార్చు కున్నాడు.

అని పద్మ లోపలికి వెళ్ళిపోయింది. విశ్వం చిరునవ్వు నవ్వుకున్నాడు ఎంతగా మారిపోయింది పద్మ! పూర్వం ఎరుపురంగంటే ఆమెకి అసహ్యం. ఇప్పుడు ఎరుపురంగు చీరలే కట్టుకుంటుంది ఇదివరకు అంత స్వేచ్ఛగా ఇంట్లో తిరిగేది ఇప్పుడేమో ప్రతి దానికీ తడుముకుంటున్నట్టుగా ఉంటుంది. తనేమిటో చుట్టపుచూపుగా వచ్చినట్టు మాట్లాడుతుంది ప్రతి విషయంలో డాక్టర్ ఇష్టా ఇష్టాలు గమనిస్తుంది. ఇంతగా ఆమె తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోటం విశ్వానికి కొంచెం కష్టంగా ఉంది. ఈ మార్పులన్నీ ఎంతవరకు పద్మ తెచ్చిపెట్టుకున్నవో, ఎంతవరకు డాక్టర్ గారి ప్రభావం ఫలితాలో తనకి తెలియవు. కాని ఇలా మారటం అంత సమంజసం కాదని తోస్తోంది తనకి. పద్మ నడిగితే ఈ విషయాలు చాలా తేలిగ్గా తోసేసుంది తనేం మారలేదనీ, ఒకవేళ మారినా ఆ విషయం విశ్వం చెప్పేదాకా తనకి తెలియదనీ అంటుంది.

శ్రావణమాసం అయిపోయింది. పద్మ ప్రయాణం కట్టింది. విశ్వం తీసుకొని వెళుతున్నాడు వెళ్ళిపోతూ గోపికి పదిరూపాయల నోటిచ్చింది పద్మ

"వాడికి నువ్వివ్వటమెందుకి?" అన్నారందరూ. కాని వాడు వెంటనే ఆ నోటు నిక్కరు జేబులో దాచుకున్నాడు అప్పుడప్పుడు అక్కయ్య తనకిచ్చిన ప్రజెంటు చూసుకుంటుంటే అదో తృప్తిగా ఉంటుందని వాడికి ఆ సమయంలో అనిపించింది.

"స్త్రీలకి ఆర్థిక స్వాతంత్ర్యం లేదు" అన్నాడు విశ్వం

"అబ్బ మొదలెట్టావా అన్నయ్యా. మళ్ళీ ప్రతి దానికీ వాదిస్తావు" అంది పద్మ.

విశ్వం మళ్ళీ నోరెత్తలేదు. తను వాదిస్తాడట! గంటలతరబడి తనతో పిడివాదం చేసుకుని ఉక్రోషం తెప్పించే పద్మేనా యీ మాటలు అన్నది!

హైదరాబాద్ లో డాక్టరుగారి ఇల్లు, ఆస్పత్రి కూడా నగరంలో ఒకచోట ఉన్నాయి. ప్రయాణపు బడలికతో కుర్చీలో కూలబడి "ఏమిటయ్యా, విసిరేసినట్టు ఇక్కడ పెట్టావు మకాం?" అని చిరాకు చేశాడు విశ్వం. శ్రీనివాసరావు నవ్వి ఊరుకున్నాడు.

ఆ సాయంత్రం శ్రీనివాసరావు తన డిస్పెన్సరీ చూపించాడు విశ్వానికి. నర్సింగ్ హోమ్ వేరేచోట ఉంది. ఇల్లూ, డిస్పెన్సరీ, నర్సింగ్ హోమ్ అన్నీ కలిపి ఒకచోట పెట్టుకుని సలహా ఇచ్చాడు విశ్వం.

"అలా అయితే చిక్కులున్నాయి" అన్నాడు డాక్టర్

"ఏమిటా చిక్కులు?"

"పొద్దస్తమానూ యీ రోగులగొడవతో నేను సతమతమవటమే కాక పద్మకి కూడా ఆ అవస్థదేనికి?"

విశ్వం అసలు విషయాన్ని తప్పించి అన్నాడు.

"'రోగుల గొడవ' అని విసుక్కునేవాడివి నువ్వేం డాక్టరువయ్యావు?"

"ఊఁ. ఎస్ టి స్పెషలిస్ట్ ని" డాక్టర్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"అసలు ప్రశ్న తప్పించకు రోగులకు సేవచేసే అవకాశం లభించినందుకు సంతోషంతో ఆ పని చెయ్యాలిగాని విసుక్కోటం డాక్టరైనవాడికి ధర్మం కాదు. అంతో ఇంతో సంఘసేవ చెయ్యాలనే అభిలాష ఉన్న నాలాంటివాడికి ఆ అవకాశం దొరకదు. దొరికిన నీలాంటివాళ్ళు అసంతృప్తితో బాధపడతారు. మనుషుల చిత్తప్రవృత్తుల్ని బట్టి ఉద్యోగాలు దొరికితే ఎంత బావుంటుంది!"

డాక్టరేమీ సమాధానం ఇవ్వలేదు. చిరునవ్వు నవ్వుతూ విశ్వంవైపు చూడసాగాడు డాక్టర్ సమాధానం చెప్పకపోవటంతో విశ్వానికి మరింత అవకాశం లభించింది తన వాగ్ధోరణి కొనసాగించటానికి

"ఒక్క ప్రశ్న అడుగుతాను చెబుతావా? తడుముకోకుండా సమాధానం చెప్పాలి"

"అడుగు."

డాక్టర్ కళ్ళలోకి గంభీరంగా చూస్తూ బాణంలా వొదిలాడు తన ప్రశ్న విశ్వం.

"నీ జీవితలక్ష్యం ఏమిటి?"

"గొప్ప డాక్టర్ని కావటమే"

గోల్ లోకి బంతిని తన్నినట్టు విజయసూచకంగా చూశాడు డాక్టర్. వెంటనే వచ్చిన ఈ సమాధానానికి ఓడిపోయిన గోల్ కీపర్ లా ముఖం పెట్టాడు విశ్వం.

"ఇంకొక ప్రశ్న ఈ పాతికేళ్ళలో నువ్వు చేసిన ఒక్క మంచిపని చెప్పు, చూద్దాం."

డాక్టర్ ఆలోచించసాగాడు. విశ్వం విజయసూచకంగా ముఖం పెట్టాడు.

# ఆత్మహత్య

కమల కళ్ళొత్తుకుని, తలుపున్న రక్తపు మరకచీర చేతులతో తుడుచుకుంటుంది—వెను వెంటనే తరవాత సరోజ వస్తుంది

సరోజ (చిరునవ్వుతో) మీకు నా కేం అంతరాయం కలిగించలేదు కదా?

రామం (ప్రశాంతం చెంది) కలిగించేవ్—

కమల: లే లేదు

సరోజ (నవ్వుతోటూ) మళ్ళీ పారిపోస్తా — ఓసారి ఎలా ఉన్నావో చూసిపోదామని

రామం చూసేవు కద

సరోజ (కమలదానికి (పలకరిస్తూ) ఏవీ ఇంకా ఇలా ఒస్తున్నావు

రామం నే అనుకుంటేను కదా

సరోజ ఔను

రామం చూసివచ్చేకదా?

సరోజ ఊఁ

రామం ఎలా ఉన్నాడు?

సరోజ ఏమిటా ప్రశ్న?

రామం క్యూరియాసిటీ కొద్దీ చూసిపోదామని వచ్చేవ్—

సరోజ అదేం మాట? స్నేహితులని చూడరూ?

రామం చూసి ఒక అభిప్రాయం మనసులో ఏర్పరచుకోవాలి, ఒక చిత్రం చిత్రించుకుని గప్ చుప్ గా పోదామనుకున్నావా?

సరోజ (కుర్చీ స్టూల్ మీద కూచోని) అనుకున్నా అనుకోపోయినా ఒక మనిషినికాని, దగ్గర స్నేహితుణ్ణి కాని చూసినప్పుడు అభిప్రాయం ఏర్పడదూ?

రామం దగ్గర స్నేహితుణ్ణి చూస్తే కొత్త అభిప్రాయాలేముంటాయి?

సరోజ కులాసాగా ఉన్నాడనో చిరాగ్గా ఉన్నాడనో

[కమలని ఇద్దరూ గమనించరు—కమల లోపలికి వెళ్తుంది]

రామం: ఆకర్షణీయంగా ఉన్నాడనో, వెగటుగా ఉన్నాడనో

సరోజ ఔను. ఓ నిముషం వెగటుగా అనిపించిన వ్యక్తి, మరో గంటలో అతడన్న ఒకమాటవల్లో, బట్టల మార్పువల్లో ఆకర్షణీయంగా కనిపించవచ్చు.

రామం అలాగే ఓసారి ఆకర్షణీయంగా ఉన్నతను వెగటుగానూ ఉండొచ్చు—

సరోజ (నవ్వి) నా కది అనుభవం

రామం ఎవరి సంగతి

సరోజ: కొందరిగురించి మనం పెద్ద అభిప్రాయం ఏర్పరచుకుంటాం—అతిప్రియమైన స్నేహితులుంటారు. కొన్ని ప్రత్యేక పరిస్థితులని ఎదుర్కోవాల్సి వచ్చినప్పుడు వారి బలహీనతలు, సంకుచితత్వం, వారన్న ఒక మాటవల్లో, ముఖంలోని భావం వల్లో కటికంగా బయట పడిపోయి దురదృష్టవశాత్తూ మనం అక్కడుండడం తటస్థిస్తే ఆ వ్యక్తిలో మనకున్న ఆకర్షణపోగా, అసహ్యంకూడా కలుగుతుంది.

రామం మాటవరసకి నేను—

సరోజ నీకేం మహారాజులా ఉన్నావ్

రామం (ముఖం వికసించగా పాత కోసంగ కూచోని) ఎలా ఉన్నాను?

సరోజ ఎప్పటిలాగే ఉన్నావ్

[కమల వస్తుంది—ముఖంలో ఇదివరకటి కన్నీటి చారలు లేవు—తల దువ్వుకుంది]

రామం నువ్వు అన్న కటిక బలహీనతలు కాని, సంకుచితత్వం కాని (కమలవేపు చూసి) మరేదన్నా కాని

సరోజ ఉంటే ఉండొచ్చు బలహీనతలు, జాగ్రత్త పట్టించేది మాత్రం కవు

రామం నీకేం తెలుసు నా బలహీనతలు—

సరోజ: తెల్సినంత మట్టుకు

రామం అయితే నేను ఇంక జాగ్రత్తగా ఉండాలి అంతేనా? మరేం అనిపించలేదు నన్ను చూడగానే?

సరోజ నా రాకనీకు ఇష్టంలేదనిపించింది, పోదాం అనుకున్నాను

రామం ఏది కష్టంలేకపోయినా వచ్చి, వచ్చిన పనయింది కాబట్టి పోదామనుకున్నావ్.

సరోజ ఏమిటాపని ?

# సముద్రపుమొక్కలు: వాని ఉపయోగములు

డాక్టర్ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి

నేలపై నుండు మొక్కలవలెనే సముద్రములో నుండు అనేక రకముల వృక్షజాతులు మనకు చాల ఉపయోగకరములను సంగతి సామాన్యులకంతగ తెలియదు. మానవుని ఆహారమునకు అత్యవసరమైన పదార్థాలను సముద్రపు మొక్కలు తయారుచేయగలవు. యిట్టి పదార్థములు యితరత్ర సులభముగా లభ్యము కాజాలవు. కాడ్‌లివర్ ఆయిల్ ఆరోగ్యము నిచ్చునన్న విషయము అందరికీ తెలిసినదే. కాని దానికి శక్తి సముద్రపు మొక్కలనుండి వచ్చునన్న సంగతి అందరికీ తెలియదు. కాడ్ అను చేపయొక్క లివర్‌లో కొన్ని విటమినులు, అయొడిన్‌ను నిల్వచేయుశక్తి కలదు. కాని అది ఈ పదార్థములను సరాసరి సముద్రములో నుండి పొందుటలేదు. అది కొన్ని చిన్న చిన్న సముద్రపు జంతువులను తినును. ఈ చిన్న జంతువులు సముద్రపు మొక్కలను తిని బ్రతుకుచున్నవి. సముద్రపు మొక్కలలో అయొడిన్, విటమినులు విరివిగా నుండును. సముద్రపు నీటిలో చాల అయొడిన్ వుండును. దీనిని సముద్రపు మొక్కలు సేకరించి దానిని చిన్న జంతువుల ద్వారా మానవునికి అందజేయుచున్నవి. జపాను దేశీయులు సముద్రపు మొక్కలను ఆహారముగా నుపయోగించుటలో అగ్రగణ్యులు. వారి ఆరోగ్య సంపద లలితకళలు, సాహిత్యము, విజ్ఞానరంగములలో వారి నిరుపమాన ప్రావీణ్యత వారి తెలివితేటలు మొదలుగాగల ఉత్తమ గుణములన్నియు వారి ఆహారము వల్లనే వచ్చినవందురు. అటులనే చైనాదేశీయుల విషయములో కూడ వారి సముద్రపు మొక్కల ఆహారము యొక్క ప్రభావము కనిపడుచున్నది. జపానులో గాయిటరు అను వ్యాధి చాల అరుదు. కాని అనేక విషయములలో పురోగమించిన అమెరికావంటి దేశములలో కూడ ప్రజల పోషణము సరిగా లేదు.

ప్రపంచమంతటను ఆహారముగా నుపయోగింపబడుచున్న సముద్రపు మొక్కలు లెక్కకు మించినవి. పోర్ ఫైరా (Porphyra) అను మొక్కను చాల దేశీయులు భుజించుటకు వాడుకొనుట కుపయోగింతురు. ఇది ఎర్రనాచు (Red Algae) అను వర్గమునకు చెందినది. దీనిని ఉత్పత్తిచేసి ఎగుమతి చేయుటలో జపానుదేశము ప్రథమస్థానము నలంకరించినది. సాలీనా జపాన్‌లో పండించు పోర్ ఫైరా పంట విలువ 50,60 లక్షలకుపై బడును. సముద్రపు టలలు తగులు ప్రదేశములలో పెద్దపెద్ద వెదురుగడల తోపులను నీటిలో పడవేయుదురు. వీనిపై పోర్ ఫైరా మొక్కలు పెరుగును. యెకరమునకు సాలీనా వచ్చుపంట విలువ సుమారు 150 డాలర్లుండును.

సముద్రపు మొక్కలనుంచి అనేకరకముల రుచికరమైన వంటకములు చేయుదురు. వాటికి అలవాటు పడినవారికి అవి యెంతో ప్రీతికరముగా నుండును. సరియైన పద్ధతిలో తయారుచేసి టొమాటో మొదలైన వాటితో కలిపి తినుకొనినచో యేవిధమైన దుర్వాసనయులేక రుచిగానుండును. ఈ వంటకములు "సూపులు" అనియు యింకను అనేక వింతపేర్లతో వ్యవహరింపబడుచున్నవి. ఇంగ్లండు, అమెరికాదేశములలో కూడ సముద్రపు మొక్కలను ఆహారముగా అనాదికాలమునుంచి ఉపయోగించుట కలదు. ఇటీవల ఈ దేశములలో యిటువంటి ఆహారములో యెక్కువ ఆసక్తి కలుగుచున్నది. కొన్ని బ్రిటిష్, అమెరికన్ వ్యాపారసంస్థలు సముద్రపు మొక్కలనుండి తయారుచేసిన ఆహారపదార్థములను "ఆర్గానిక్-సీ-ఫుడ్" "సీ కెల్ప్" అను పేర్లతో అమ్ముచున్నారు. దీనిలో మానవుని ఆహారమున కత్యవసరమైన అయోడిన్, యినుము, కాపర్, కాల్షియమ్, ఫాస్ఫరస్, సోడియమ్, పొటాషియమ్, మెగ్నీషియమ్, సల్ఫర్, మాంగనీస్, అల్యూమినియం, జింక్, క్లోరిన్, మొదలైన ఖనిజములు విటమిన్ A, B D I లు కలవు. వివిధ రకములైన ఆహార పదార్థములను అందచేయుటలో సముద్రపు మొక్కలు సాటిలేనివి.

ఆహారముకొరకేగాక సముద్రపు మొక్కలు పరిశ్రమలలో కూడ ప్రాముఖ్యత గలవి. కెల్ప్

# సముద్రమొక్కలు · వాని ఉపయోగములు

(Kelps) అను ఒక రకము సముద్రపు మొక్కలు చిర కాలమునుండి అయోడిన్ తయారు చేయుట కుపయోగ పడుచున్నవి. ఇవి "బ్రౌన్ ఆల్ గే" (Brown Algae) అను తరగతికి చెందినవి. ప్రధానముగా అట్లాంటిక్, పసిఫిక్ సముద్రతీరము లందుండును. వీటిలో కొన్ని 30-60 మీటర్ల పొడుగుండి 10-30 మీటర్ల లోతుకు పెరుగు పోవును. అయోడిన్ ఖనిజములనుండి తయారు చేయు పద్ధతి కనిపెట్టక పూర్వము, అది చాలవరకు కెల్ప్ లనుండే లభ్యమగుచుండెను. ఆధునిక కాలములో కూడ యుద్ధసమయమున లేక ఇతర అత్యవసర సమయముల యందును అయొడిన్ కెల్ప్ నుండి తయారు చేయుటకలదు. ప్రత్యామ్నాయముగనే కాక కెల్ప్ లు ఆహారమునకు కూడ ప్రాముఖ్యత కలవి. జపానువారు ఎండిన కెల్ప్ మొక్కలనుండి "కొంబు" అను ఆహార పదార్థమును తయారు చేయుదురు. జపానులో సాలీనా అనేక వేల డాలర్ల విలువగల కెల్ప్ మొక్కల పంట పండించుచున్నారు.

జామ్ను గట్టి అంటరికీ తెలిసినదే దీనినే "అగర్ అగర్" అని కూడా అందురు. యిది కూడ సముద్రపు మొక్కలనుండి తయారుచేయబడును. బట్టలు తయారుచేయుట మొదలైన పరిశ్రమలలో ఉపయోగ పడుచున్నది. ముఖ్యముగా యిది జపానులో ఉత్పత్తి యగుచున్నది. సాలీనా 2, 3 లక్షల డాలర్ల విలువగల అగర్ అగర్ జపానులో తయారగును. దీనిని కొన్ని ప్రదేశములలో శీతోష్ణ పరిస్థితులు అను వుగా నున్నచోట్ల తయారు చేయుదురు.

డయటమ్స్ అనునవి మరియొక సముద్రపు మొక్కలు. వీనిలో కొన్ని జాతులు మంచినీటిలో కూడ పెరుగును. ఇవి సూక్ష్మజీవులు. కాని ప్రాథమి కముగా చాల ప్రాముఖ్యత గలవి. సూక్ష్మదర్శినిలో చూచువారికి అత్యంత సౌందర్యవంతముగా కన బడును. ప్రాచీన యుగములలో మహోజ్వల చరిత్ర కలవి. ప్రస్తుత కాలములో వీనిమొక్క శిధిలములు ఫాజిల్స్ రూపములో డయటమేషియస్ ఎర్త్ (Diatamaceous Earth) అను పేర అనేక ప్రదేశ ములలో కన్పడుచున్నవి. కాలిఫోర్నియాలో డయటమేషియస్ ఎర్త్ అనేక మైళ్ళ విస్తీర్ణము కలిగి 700 అడుగులపైన మందము కలిగియున్నది. శాంటా మరీనా (Santa Marina) ప్రాంతములో డయటమేషియస్ మృత్తిక భూమి అంతర్భాగమున 3000 అడుగుల లోతువరకు కలదు. అమెరికాలో సాలీనా 2, 3 లక్షల టన్నుల డయటమేషియస్ ఎర్త్ ఉత్పత్తి యగుచున్నది. ఇది డైనమైట్ తయారు చేయుటలోను, పంచదార ఫ్యాక్టరీలలోను, లోహముల నుపయోగించు పాలిష్ తయారు చేయుటలోను, టూత్ పేస్ట్ తయారు చేయుటలోను ఉపయోగపడుచున్నది.

మన దేశములో కూడ సముద్రపు మొక్కలను విరి విగా ఉపయోగించుటకు అవకాశము లున్నవి. మన సముద్రతీరములందు దొరకు అనేక జాతుల సముద్రపు మొక్కలు యిప్పుడు వృధా అయి పోవుచున్నవి. ఉదాహరణకు ఒరిస్సాలోని చిల్కా ఉప్పునీటి సరస్సులోనుండు గ్రాసిలేరియా అను మొక్కను అగర్ అగర్ తయారుచేయుట కుపయో గించవచ్చును. యిటులనే దక్షిణ భారత సముద్ర తీరమందు దొరకు పోర్ ఫైరాను ఆహారపదార్థములు తయారుచేయుట కుపయోగించవచ్చును. ఈ సందర్భ ములో ఒక విషయమును తెలియజేయవలసియున్నది. కొన్ని దేశములలో సరస్సులందు పాచిమొక్కలను వృద్ధిచేయుటకు ప్రయోగములు చేయుచున్నారు. అట్లు చేసినచో ఆసరస్సులలోనుండు చేపలకు మంచి ఆహా రము దొరకును. తిరిగి ఆ చేపలవలన మానవునికి మంచి పోషకమగు ఆహారము లభించును. కాబట్టి మన దేశములో కూడ అట్టి ప్రయోగములు చేయవలసిన ఆవశ్యకతను ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు. కలకత్తాలోని ఉప్పునీటి సరస్సులు, ఒరిస్సాలోని చిల్కా సరస్సు, మద్రాసుదగ్గరనున్న ఎన్నూర్ ఉప్పు నీటి సరస్సు యిట్టి ప్రయోగములకు వీలుగా నుండును

# ఇల్లు కూలింది

శ్రీ అంగర సూర్యారావు

పాత్రలు: రామ్మూర్తి, నారాయణ, శేఖరం, రమణయ్య, నరసయ్య, ప్రకాశం, కుచేలరావు, బిల్లుకలెక్టరు నీలవేణి.

* * ఒక ఆఫీసులోని పెద్ద హాలు హాలు మధ్య రికార్డు రూంలోకి వెళ్లేద్వారం కనిపిస్తోంది ద్వారానికి యిరువైపులా హాలులో రెండు బల్లలూ రెండు కుర్చీలు ఒకదానికి ఒకటి యెదురుగా వున్నాయి ద్వారానికి ఎడమవైపు వున్న సీటులో శేఖరం కూర్చుని వున్నాడు వయస్సు 25 సంవత్సరాలు రాస్తూ మధ్యమధ్య కుడివైపుచూస్తూ వున్నాడు. హాలుకు ఎడమవైపున ఒక ద్వారం కనిపిస్తూవుంది పైవాళ్ళు వస్తే కూర్చునేటందుకు హాలులో మరో రెండు ఖాళీ కుర్చీలుమాత్రం వున్నాయ్ కుడివైపునుంచి రమణయ్య నరసయ్య వస్తారు. ఇద్దరూ వెలిసిపోయిన పంచెలు, అతుకుల చొక్కాలు వేసుకొని వున్నారు. తలపాగాలు చుట్టుకున్నారు. వయస్సు రమారమి 40 సంవత్సరాలు. ఇద్దరి ముఖాలలో అత్యుత్సుకత దైన్యం, తొందరపాటు కని పిస్తూ వుంటాయి.

రమణయ్య: (వస్తూనే) అయ్యా! నమస్కారం.

నరసయ్య: నమస్కారం బాబూ!

శేఖరం: ఎవరు మీరు?

రమ: నా పేరు రమణయ్య అండి

నర: అందరూ రమణయ్య మేష్టారు అంటారులెండి.

రమ: వీరి పేరు నరసయ్యగారు

నర: మేం యిద్దరం బడిపంతుళ్ళముండి.

శేఖ: ఎందుకు వచ్చారు?

రమ: సావధానంగా వినాలి తమరు. అంతా పూస గుచ్చినట్టు మనవిచేస్తాం.

నర: పొద్దున్నుంచి యిక్కడిదాకా ఆలోచించు కుంటూ నే వచ్చాం. బోల్డు సంగతులున్నాయి మనవి చేసుకోటానికి

శేఖ: మీరు కొంతసేపు

రమ: (అమాంతంగా మధ్యలో అందుకొని) బాబ్బాబు! అభ్యంతరం చెప్పకండి.

నర: మా మనవి వినండి

రమ: మాటి తప్పయితే దండించండి ఒప్పు కుంటాం.

[శేఖరాన్ని మాట్లాడనివ్వకుండా యిద్దరూ ఒకరొకరు చెప్పేస్తూ వుంటారు.]

రమ: మేం బలానికి గొప్పవాళ్ళం

నర: అయినా కూటికి బీదవాళ్ళముండి.

రమ: బడిపంతుళ్ళకంటే రోడ్లుతుడుచుకునే కార్మి కులకు ఎక్కువ హక్కులున్నాయండి.

నర: ఈ మేష్టరు విద్యార్థులు నోరెత్తితే చాలు "[illegible]! కూల్చి పారేస్తాం." అంటున్నారు.

రమ: మళ్ళా మాట్లాడితే మళయాళదేశం పొమ్మం టున్నారు.

శేఖ: ఎవరు? (యింకా యేదో అనబోతాడు)

నర: (మధ్యలో అందుకొని) యింకెవరు బాబయ్యా! మా పైవాళ్ళు.

రమ: అంటే మా నెత్తిమీద వున్నవాళ్ళు.

నీలవేణి : (వస్తూనే) ఎక్స్క్యూజ్ మి శేఖర్! నిన్ను డిజ పాయింట్ చేశాను

శేఖ నువ్వు చెప్పినట్లు ఉదయమే వచ్చి కూర్చున్నాను అప్పటినుంచి మెట్లకొప్పి వైపే వరకూ ఎదురుచూస్తూ వున్నాను

నీల : మా పిన్నిగార్ని స్కూల్లో చేర్పడానికి వెళ్ళాను. అక్కడ నాకు చదువుచెప్పిన టీచర్ ఒకావిడ కనిపించారు. నేను ఉద్యోగం చేస్తున్నానని చెప్పగానే ఆవిడకు ఎక్కడలేని సంతోషం వచ్చింది. చాలాసేపు మాటాడుతూ కూర్చో బెట్టేం. అదిలే వదిలించుకొని వచ్చేసరికి యీ వేళయ్యింది

శేఖ : హాయిగా నీతో కొంతసేపు మాటాడవచ్చు కదా అని ఉదయమే వచ్చాను నువ్వు రాలేదు సరికదా, మధ్యాహ్నం తినవలసిన చివాట్లు ఉదయమే తిన్నాను

నీల ఆదేం?

శేఖ నువ్వు ఎప్పుడొస్తావా అని రోడ్డుకు చూస్తూ కూర్చున్నాను [illegible] వినిపించి ఆత్రుతగా చూశాను నీ నవ్వుముఖానికి బదులు మా సెక్షన్ హెడ్ గారి ముఖం కనిపించింది

నీల ఆ మ్యానేజరుగారు అప్పుడే వచ్చారా!

శేఖ పుటి మునిగినట్లు ఉదయమే వచ్చి తగలడ్డాడు ఎకౌంట్ బుక్కులేవని నానా హంగామా చేశాడు

నీల (చుట్టూ చూసి) యేరీ? కనిపించరేం?

శేఖ రాగానే రెండో మహానుభావుడు దొరికాడు. అతనితో యిప్పుడే బజారుకు దయచేశాడు

నీల మేనేజరుగారు వచ్చారా?

శేఖ లేరు బ్యాంకుకువెళ్ళి డబ్బు తీసుకువస్తారు. ఆయన వచ్చేసరికి చాలా ఆలస్యం అవుతుంది.

నీల ఇవేళ ఒకటవ తేదీ కదూ! మరిచిపోయాను.

శేఖ ఈ మధ్య నీకు మరుపు యెక్కువ అవుతోంది.

నీల అంటే?

శేఖ మనసు స్థిమితం లేకపోతే మరుపు ఎక్కువవుతుం దంటారు.

నీల నిన్ను చూస్తూవుంటే నా క్లాస్ మేట్ మధు జ్ఞాపకం వస్తూవుంటాడు.

శేఖ అతనుకూడా నాలాగే వుంటాడా?

నీల రూపంలో కాదు గుణాలలో—'మరుపు ఎక్కువ',—'దిక్కులు చూస్తూవుంటావు'— మొదలైన మాటలు ఎక్కువగా ఉపయోగిస్తూ ఉంటాడు

శేఖ : నువ్వేమీ అనుకోకపోతే ఒకమాట అడుగుతాను

నీల ఏమిటది?

శేఖ ఇంతకాలంవరకూ నువ్వెందుకు పెళ్ళిచేసుకోలేదు.

నీల : చిన్నతనమున్నప్పుడే చేతులకు సంకెళ్ళు తగిలించుకోమంటావా?

శేఖ అంటే స్వేచ్ఛగా తిరగడానికి వీలుండదనా?

నీల (కోపంతో) యేమిటా మాటలు?

శేఖ యేమీ అనుకోకు నీలవేణీ! నీ పదాలు నాకు వింతగా కనిపిస్తున్నాయ్. అసలు జీవితంగురించి, భవిష్యత్తుగురించి నువ్వు కొంచెమైనా ఆలోచిస్తున్నావా అని నా సందేహం

నీల ఇంతవరకూ ఆలోచించలేదు ఇకముందుకూడా ఆలోచించను.

శేఖ నీ ఉద్దేశం?

నీల సంతోషంగా జీవితం గడపడమే నా ఆశయం. జరిగిపోయినవాటినిగురించి కాని, జరగబోతున్న వాటిగురించి కాని నేను మనసు పాడుచేసుకోను

శేఖ : నీతో చాలా విషయాలు మాటాడాలి నీలవేణీ!

నీల (మెరిసే కళ్ళతో అతని ముఖంలోకి చూస్తూ) నాతోనా!

శేఖ అవును నీతోనే!

నీల కొంపతీసి నువ్వుకూడా నన్ను ప్రేమించావనవు కదా?

శేఖ ఇదివరకే యెవరైనా అన్నారా?

నీల అవన్నీ యిప్పుడెందుకు!

శేఖ సరే, సాయంత్రం యింటికి వెళ్ళిపోయే ముందు నువ్వూ నేనూ యిద్దరం కలిసి వెడదాం

నీల ఎక్కడికి?

శేఖ సినిమాకు, బీచికి, పార్కుకు—యెక్కడికైనా సరే, యేకాంతంగా మాట్లాడ్డానికి వీలుండే చోటుకు

నీల ఇక్కడ ఎవరూ లేరుగా చెప్పు

శేఖ : ఈ కాగితాల చిట్టడవిలో—క్రూరమృగాల కంటె సెక్షన్ హెడ్స్ తిరిగే చోటులో

వైపునుంచి ఒక కాగితం పట్టుకొని నీలవేణి వస్తుంది.]

నీల రామమూర్తిగారు లేరే?

శేఖ రికార్డురూంలో—వున్నారు. ఎందుకు?

నీల ఆయన రైటింగ్ నాకు సరిగా బోధపడదు. (అతనివైపు తిరిగి కాగితం చూపిస్తూ) యీ మాట యేమిటి?

శేఖ డిస్క్రిపెన్సీ.

నీల ఇందాక ఆయన ధుమధుమ లాడుతున్నారెందుకు?

శేఖ చేతిలో డబ్బులేకపోతే రూక్షత్వం చిరాకూ వస్తుంది. ఇప్పుడు చల్లబడ్డారులే

నీల ఇంకా కోపం అంతలేదుగా!

శేఖ : రామమూర్తిగారిపద్ధతి చాలా వింతగా వుంటుంది కొన్నాళ్ళు మంచిగా ఉండి అలా తయారవుతా మేఘాలవలె భయంవేస్తుంది.

నీల ఏం? ఏం జరిగింది?

శేఖ ఎవరో ఒక మేనేజరు వచ్చాడు మాటాడకుండా అతనిని వెళ్లగొట్టేశాడు. తరవాత ఆఫీసు దొంగిలిపోయేలా అతనిమీద కేకలువేశారు. వెంటనే అతడు రామమూర్తిగార్ని పైకి తీసుకుపోయాడు ఆ తరవాత యేం జరిగిందో మనకు తెలియదు. యిద్దరూ ప్రాణ స్నేహితులలా తయారై తిరిగివచ్చారు

నీల : పోనిద్దూ! అటువంటి గొడవలు మనకెందుకు? (కుర్చీ అతనిముందుకులాగి కూర్చుని) 'హెలెన్ ఆఫ్ ట్రాయ్' చూశావా?

శేఖ : లేదు.

నీల చాలా బాగుంది నేను వెళ్దాం అనుకోలేదు. సుందరం బలవంతం చేస్తే వెళ్ళాను

శేఖ అతడు నీ స్నేహితురాలా?

నీల (నవ్వుతూ) సుందరం అంటే ఆడపిల్ల కాదు. మగాడు.

శేఖ అతడు మీకు దగ్గరబంధువా?

నీల ఛ! కాదు. అతనితో పరిచయం చాలా తమాషాగా జరిగింది ఒకనాడు సిటీబస్సులో ఖాళీ లేదు అతడు లేచి నాకు చోటుయిచ్చాడు ఆ మర్నాటినుంచి నాకోసం అతడు బస్ స్టాప్ దగ్గర కనిపిస్తూనే వున్నాడు.—మంచి హాస్యమైన మనిషి! నా పుట్టినరోజుకు షిఫాన్ చీర ప్రజెంట్ చేశాడు మాయింట్లోవాళ్ళంతా తప్పు-తీసుకోవద్దన్నారు. మనం పట్టించుకు కూర్చుంటే అన్నీ తప్పులే! యేమంటావ్?

శేఖ (సీరియస్ గా) అప్పుడు నువ్వేం చేశావ్?

నీ : అతనిని డిజప్పాయింట్ చెయ్యడం నాకు యిష్టం లేదు. యాక్సెప్ట్ చేశాను

[రామమూర్తి రికార్డు రూంలోంచి ఫైలుతీసుకొని వస్తాడు.]

రామూ (వస్తూనే యిద్దర్నీ చూసి) మళ్లా ప్రారంభించారా? ఈ వేళ యింక బడ్జెట్ అయినట్టే! తెల్లవార్లూ దీపారాధన చేస్తూ కూర్చోవలసిందే!

నీల లేదండీ! ఈ సెంటెన్సు యేమిటో అడగడానికి వచ్చాను (కాగితం చూపిస్తుంది)

రామూ (చదువుతూ బిగ్గరగా) "దిస్ డిస్క్రిపెన్సీ షుడ్ బి రెక్టిఫైడ్."

నీల నాకేం చెముడనుకున్నారా! అంత గట్టిగా కేకవేస్తారు

రామూ లేదమ్మా! అసలు ఆ సెంటెన్సు రూంలో కోపంతో రాసింది అలా చదివితేగాని దానికి 'యెంఫసిస్' రాదు (నీలవేణి సీరియస్ గా తనసీటు వైపు వెళ్ళిపోతుంది)

శేఖ ఫైల్ దొరికిందా?

రామూ (చొక్కాకు వున్న ధూళి దులుపుతూ) దొరక్క యేమౌతుందోయ్! దొరికింది అసలు ఆ రికార్డు రూంలోకి వెళ్ళడానికే భయం, దుమ్మూ ధూళితో నిండివుంటుంది

శేఖ : మరి అదెప్పుడూ దులిపించరేమండి?

రామూ ఎవరు దులుపుతారు? కావాలంటే నువ్వూ నేనూ కలిసి దులపాలి!

శేఖ మరి బంట్రోతు లెందుకండీ?

రామూ బంట్రోతు లెందుకంటావా నాయనా, వాళ్ళు అధికార్ల యిళ్లలో బట్టలు ఉతకడానికి పై పనులు చేయడానికిని. నెలకోసారి వాడు మనుగుడుపు పెళ్లికొడుకులా వచ్చిపోతూ ఉంటాడు. బంట్రోతు చేసేపనికూడా కిక్కురుమనకుండా గుమాస్తా చేసుకోవాలి ఏది గతిలేక ఈ ఉద్యోగం చెయ్యడం కాని—గుమాస్తా పని

# ఇల్లు కూలింది

వర: వెంకటరత్నంగారి తరఫున మేం ప్రచారం చెయ్యలేదండి

రమ: మేం చేసిన నేరం అదేనండి బాబూ!

వర: ఆయన మామీద పగసాధించాలని చూస్తున్నారండి.

రమ: మమ్మల్ని ఉద్యోగాలలోంచి తీసెయ్యాలని చాలా ప్రయత్నాలు చేశారండి

వర: కోర్టులో అర్జీ పెట్టారండి

రమ: మహాజరుకు మహాజరు పంపించేశారండి

వర: ఒక మాష్టిలోకి పసిబేతోనూ, ఎవరు చేతోనూ అరవజను వేలిముద్రలు వేయించేరండి

రమ: చివరకు న్యాయమే గెలిచింది బాబయ్యా

వర: చిన్నబాబుయిగారు దేవుళ్ళా సాయపడ్డారు.

రమ: ఆయనే కేసు కొట్టించేశారండి

సారా: ఒక్క క్షణం ఆగండి చిన్నబాబుయిగారెవరు?

రమ: అదే! చిన్నబాబుయిగారికి తెలీదా అండి తమకు!

వర: ఆయన మా పూర్వోళ్ళ పెదమామగారి అండి

రమ: ఆయన పుణ్యమా అని మేం యింతకాలం ఖులాసాగా బతికాం బాబయ్యా!

వర: (రమణయ్యతో) దాపరికం దేనికు? నిజం చెప్పేద్దాం

రమ: తప్పేముంది? చెప్పేద్దాం,

వర: అయ్యా! అసలు రహస్యం చెప్పేస్తున్నాం తమకు

రమ: చిన్నబాబుయిగారు తన పిల్లల్నీ తన బంధువుల పిల్లల్నీ మా దగ్గరకే ట్యూషనుకు పంపిస్తారండి

వర: తమ దగ్గర దాచడమెందుకు? నెలకో యాభై రూపాయలు యిప్పిస్తారు

రామూర్తి: (ఆవేశంగా కుర్చీలోంచి పైకి లేచి) హారి పాయలు బంగారం కాను! ట్యూషన్లు చెబుతున్నారా? ట్యూషన్లు!!

రమ: చిత్తం బాబయ్యా! చిత్తం!

రామూర్తి: యింకా భయం లేకుండా "చిత్తం" అంటున్నావే? మీ యిద్దరి పేరూ చెప్పండి ముందు ట్యూషను చెప్పకూడదని మేం ఆర్డర్లు జారీచేసినాపుంటే మీరు చెబుతున్నారా?

వర: చెప్పకపోతే ధర్మానా బాబయ్యా?

రమ: తిరిగిచ్చే గ్రాంటుమీద ఆధారపడితే

వర: మేం యీనాడో ఆకలియాత్ర పుచ్చుకోవలసింది బాబయ్యా!

రామూర్తి: (కోపంగా) ముందు మీ పేర్లు చెప్పండి. మీ సంగతేమిటో తేలుస్తాం.

సారా: రామూర్తి గారూ! కూర్చోండి వాళ్ళు చెప్పేది పూర్తిగా విన నివ్వండి

రమ: (సంతోషిస్తూ) తమరు మా కళ్ళు వచ్చాలి!

వర: అధికార్లు తమరే వినకపోతే యింకా మా మొర ఎవరు వింటారు బాబయ్యా

రమ: మేం ఉభయులం కలిసి తమకు ఒక అర్జీ పంపించాం బాబయ్యా

సారా: ఎప్పుడు పంపించారు?

వర: అబ్బో! యెన్నాళ్ళైందని! నాలుగు నెలలవుతుందండి

రమ: తమ దగ్గరనుంచి జవాబు రాలేదండి

సారా: మాకు అందితే వెంటనే జవాబు యిచ్చేవాళ్ళం కదండి రామూర్తి గారూ?

రామూర్తి: అందలేదండి మనకేమీ అందలేదు

రమ: పైగా అర్జీ తాలూకు కాపీలు తీసుకువచ్చాం బాబయ్యా!

వర: ఒకటే రెండూ కాదు నూట కాపీలు తీసి అందరికీ పంపించాం బాబయ్యా!

రమ: (జేబులోంచి కాగితం తీసి) చదివి వినిపిస్తాను. తమరు శ్రద్ధగా వినాలి

సారా: చాలా పెద్దదిలా వుందే!

వర: (తన జేబులోంచి కూడా కాగితం తీసి) యింతో నేను పట్టుకు బాబయ్యా చకచకా చదివేస్తాం

రామూర్తి: (కలం టేబులుమీద పారేసి) యిక యీ బడ్జెట్ యీ వేళకు తెమిలినట్టే!

రమ: (చదువుతూ) 'అయ్యా, మేము యీ గ్రామములో వినయవిధేయతలతో పనిచేయుచున్నాము. మా బడిలో బాలుర సంఖ్య పెంచితిమి! (తల పైకెత్తి) యిక్కడ అక్షరాలు చెరిగిపోయినై వరసయ్యగారూ! మీ కాపీ చూపండి.

వర: (చదువుతూ) 'బడిని సర్వతోముఖముల అభివృద్ధి తెచ్చితిమి'

రమ: (చదువుతూ) ఇది యిట్లుండగా విషాదకరమైన సంఘటన జరిగినది. గ్రామ పెద్దలు మా ఉభయులను రాజకీయ సుడిగుండములోనికి (అక్షరాలు వెతుకుతూ వుంటాడు)

వర: (వెంటనే అందుకొని) లాగిరి మా చిన్న తలల పెద్ద భారమును పెట్టిరి ఎన్నికలు ముగిసినవి. కోపతాపములు పెరిగినవి సాధుజనములు మూలపడి రౌడీలు చెలరేగిరి

రమ: (చకచకా చదువుతూ) 'కర్రలు పైకి లేచినవి. బుర్రలు చితికినవి కోర్టులకు రాకపోకలు పెరిగినవి'

నర (చదువుతూ) మేము ప్రాణములు గుప్పిట పెట్టుకొని ఒదిగి కూర్చుంటిమి రౌడీలు తోడేళ్ళ గుంపులవలె మా బడిపైని పడుచున్నారు?

రమ (చదువుతూ) 'మేము ఉద్యోగ ధర్మమును వ్రతముగా నిర్వర్తించలేకపోవుచున్నాము మా ప్రాణభయము ముఖ్యముగా నున్నది మా బడి చుట్టూ పోలీసు కాపలా పెట్టించగలందులకు విద్యాధికారులతో వేడుకొనుచున్నాము యిట్లు బోధకులు వెంకటరమణయ్య, అప్పల నరసయ్య'

[యిద్దరూ కాగితాలు నారాయణకు యిస్తారు]

నారా : వూళ్ళో పెద్ద లెవరూ కలగజేసుకోవటం లేదా?

రమ : లేరు బాబుగారూ! పెద్దమనుషులంతా పట్నంలో మకాం పెట్టేసి వ్యవహారం నడిపిస్తున్నారు

రామ్మూర్తి (సీరియస్‌గా) యేమండోయ్ పంతులూ! మేం యిలాంటి వ్యవహారాల్లో కలగజేసుకోడానికి వీల్లేదు. మీరు పోలీసు స్టేషనుకుపోయి రిపోర్టు చేసుకోండి

నర బాబ్బాబు! అలా అనకండి చచ్చిపోతాం

రమ మా రిపోర్టుకంటే మీ రిపోర్టుకే విలువ వుంటుంది బాబయ్యా!

నర అసలే మేం కష్టాలలో వున్నాం

రమ మా వుసురు తగలనివ్వకండి బాబయ్యా

రామ్మూర్తి ఓహో! శాపనార్థాలు కూడా పెడుతున్నావ్!!

నర తమరు దయచూపాలి.

రమ : అన్ని కష్టాలూ ఒక్కసారే వచ్చిపడ్డాయి బాబయ్యా

నర గర్భదరిద్రులం బాబూ

రమ తినడానికి పూరిగా తిండి లేదు కట్టుకోడానికి సరైన వస్త్రం లేదు

నర తలదాచుకోడానికి కొంపకూడా లేదుబాబయ్యా!

రమ మేం యిద్దరం ఒకకొంపలోనే వుండేవాళ్ళమండి.

నర ఆ యిల్లు మొన్నటి వర్షాలకు .

రమ (దుఃఖంతో అందుకొని) మా యిల్లు కూలిపోయింది బాబయ్యా!

నారా నన్ను కొంచెం మాట్లాడనివ్వండి—మీ యిల్లు కూలిపోయినందుకు నేను చాలా విచారిస్తున్నాను. కాని మా యిళ్ళుకూడా నేడో రేపో కూలడానికి సిద్ధంగా వున్నాయ్ మీరు యిక.

రమ (వెంటనే అందుకొని) రెండు మాటలూ చెప్పనివ్వండి బాబయ్యా!

నర మా యిల్లు కూలిపోయింది తలదాచుకోడానికి గ్రామంలో ఎవరూ మాకు చోటు యివ్వలేదు బాబయ్యా

రమ : ఇవ్వలేదంటే వాళ్ళ తప్పేమీ లేదండి. మాకు చోటు యిస్తే వెంటనే రౌడీలు వచ్చి వాళ్ళ యింటిమీద పడతారని భయమండి

నర మేం పల్లె మునసబుగారి కాళ్ళమీద పడ్డామండి.

రమ ఆయనకు కనికారమూ వుంది, భయమూ వుందండి.

నర బందెలదొడ్డిలో ఒక ఖాళీ వరండా మాకు యిచ్చారండి.

రమ అక్కడే వుంటున్నాం బాబయ్యా

శేఖ బందె దొడ్డి అంటే?

నర మనుషులు నేరంచేస్తే జైల్లో పెడతారండి.

రమ అలాగే మూగ పశువులు నేరంచేస్తే బందెల దొడ్డిలో పెడతారండి

నర బందెదొడ్డి అంటే అదేనండి

[దూరాన్నుంచి వరసగా నినాదాలు వినిపిస్తాయి డబ్బాలో డబ్బులు వేసి గలగల లాడిస్తున్న శబ్దం వినిపిస్తూ వుంటుంది — "ఉపాధ్యాయుల సంఘానికి జై!"—"ఉపాధ్యాయులు — వర్ధిల్లాలి" "అణా ఉద్యమం—వర్ధిల్లాలి"— అందరూ ఆతురతగా కుడివైపు చూస్తూ వుంటారు నినాదాలు దూరంగా పోతాయి]

నారా యేమిటది?

రమ కొత్త ఉద్యమం బాబూ!

నర మేం ఎన్నో విజ్ఞప్తులు చేసుకున్నాం

రమ అధికారులు మా జీతాలు సరిగా పెంచలేదు బాబయ్యా

నర మా దరిద్రం రోజురోజూకూ పెరిగిపోతోందండి.

రమ మా స్థితి ప్రజలకు తెలియజెయ్యడం కోసమే యీ కొత్త ఉద్యమం బాబయ్యా

[వెంటనే రమణయ్య, నరసయ్య తమ భుజాలకు వున్న సంచులలోనుంచి చెరొక గిన్నె పైకి తీస్తారు]

నర ఇవి అక్షయ పాత్రలండి

రమ ఇది అసమ్మతి తెలియజేసే ఉద్యమమండి ఒక అణా మాత్రం వేస్తేచాలు

నర (రామ్మూర్తితో) బాబయ్యా! తమరొక అణా వేయండండి

రామ్మూర్తి అమాంతంగా (లేచి) పోతారా? బయటకు గెంటించాలా! జీతాలు చాలవట! బడిలో చదువు చెప్పరు. ఊరినిండా ట్యూషన్లు ప్రయివేట్ చదివించి కుర్రాళ్ళని పాస్ చెయ్యిస్తం.

# కలగూరగంప

## నాగరికత

శ్రీ నాగభూషణం

సంఘ జీవనము సమస్త ప్రాణికోటిలో కన్పించే సహజలక్షణం బలీయమైన అనన్యమూడా స్వజాతి సంబంధించిన జీవులన్నీ ఒక కూటమిగా జీవించటం మనం తిలకిస్తూ ఉంటాం. కోతులు ఒక కూటమిగా, భ్రమరాలొక కూడికగా, మత్స్యములు మరొక కూటమిగా ఉండటం మనం దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. కాని పేర్కొనిన "స్వజాతి సంకీర్తన" మానవునిలో కూడ ఉండే సహజ లక్షణం. ప్రయోజనం దృష్ట్యా, సంఘజీవన బద్ధతగా వ్యక్తికతను, మానవుడు మరింత గుర్తించాడు. పరస్పర సహకార సహకారాలే మానవ జీవితాలను సుభ్రపం చేస్తాయి. వైలక్షణ్యం ముఖ్యం కావలంటే మానవుడు తప్పనిసరిగా కొన్ని నియమ నిబంధనలను అనుసరించవలసి ఉంటుంది. కాలగమనంతో పాటు మానవజీవిత విధానాలు పెంపొందుతూ ఉంటాయి. జీవితావసరాలను సాధించే ప్రయత్నములో నాగరికత పుట్టుకొని ఉంటుంది. జీవితం మరింత సుఖవంతము చేసుకోవాలనే తీరని కాంక్ష, కళాతృష్ణ నాగరికతా పురోభివృద్ధికి ఆధారభూతాలు.

నాగరికతకు ఒక రూపాన్ని ఆపాదించి, ఆ ప్రత్యేక రూపమే "నాగరికత" అని ఇదమిత్థంగా తెల్పి చెప్పడం కష్టం. జాతి, జాతికీ, నాగరికానికీ మధ్య నాగరికతా స్వరూప స్వభావాలలో వైవిధ్యం ఉండి తీరుతుంది.

వారి వారి, దేశ కాల పరిస్థితులు కళాదృష్టి, అవసరాలు, అభిరుచులు, వైవిధ్య దృష్టుల ప్రభావంతో, నాగరికతా స్వరూప స్వభావములలో వైవిధ్యం ఉంటున్నది. ఇందుమూలముగా ఒక జాతి లేక ఒక దేశ నాగరికతే ఉదాత్తమైనదని నిర్ణయించడం కష్టం. ప్రయోజనం దృష్ట్యా, కళాదృష్ట్యా, ఒక నాగరికత, ఉత్కృష్టత సాపేక్షంగా మాత్రం, నిర్ణయించవచ్చును. ఈ విధంగా కాని ఒక నాగరికత ఉత్కృష్టతను నిర్ణయించే సమయములో, వారి వారి దేశకాల పరిస్థితులు, అవసరాలు, అభిరుచులు, దైహిక దృష్టులను, మనం దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. మానవుని "భౌతిక సాధన, సంపద, మేధ" లచే నాగరికత అని స్థూలంగా నిర్వచించవచ్చును.

ప్రస్తుతం మనం నాగరికతగా పరిగణించే విషయాన్ని రెండు భాగాలుగా విభజించవచ్చును (1) భౌతిక నాగరికత (2) అభౌతిక నాగరికత

### భౌతిక నాగరికత

పంచేంద్రియాలద్వారా గ్రహింపబడునది భౌతికము. మానవ నిర్మితమైన భౌతిక సాధనాలే "భౌతిక నాగరికత" గృహనిర్మాణము, వస్త్రోత్పత్తి, ఆహారోత్పత్తి వగైరాలను మనం దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. మానవావసరములు రెండు రకములు (1) మౌలావసరములు (2) కల్పితావసరములు. మౌలావసరములు జీవించుటకు తప్పనిసరి అయినవి. ఆహారము, నీళ్లు, గాలి వగైరాలను మౌలావసరములుగా పేర్కొనవచ్చును. వస్త్రధారణ, గృహావాసము వగైరాలను కల్పితావసరములుగా పేర్కొనవచ్చును. కల్పితావసరములు లేకున్నను మానవుడు జీవించగలడు.

మానవప్రయత్న ప్రమేయం లేకుండా ప్రకృతి ప్రసాదితమైన ఆహారముతోనే ఆదిమానవుడు జీవించేవాడు. కాలగమనంతో పాటు ఆహారపు కొరత ఏర్పడినది. ఆ కొరతను తీర్చుకొనుటకు మానవ ప్రయత్నాన్ని మేళవించి, ప్రకృతిని వినియోగించుకోవలసి వచ్చింది. ఈ విధంగా మౌలావసరాలే నాగరికతా పురోభివృద్ధికి ప్రథమ సోపానమైనది. కల్పితావసర సాధన సంపత్తే నాగరికతకు ద్వితీయ సోపానము. జీవితాన్ని

. . . . . ..

తూగు పొలుపట్టు దుమ్ముళ్లో, నీరు జాడ
మబ్బులో దండవన్య, మునరేల, దిగికన్య—

ఈ మొదలైన చోట్ల ఊహారమ్యత గోచరిస్తున్నాయి. "ప్రకాశ ప్రశంస" అనే శీర్షికలో వీరు వెలువరించిన ఒక అభిప్రాయాన్ని యిక్కడ పరామర్శించడం అవసరం.

కళలు పూజ్యమా మా తెలంగాణమీరు
బరాడి గుప్పిథ మా పులకరించి—

ఆ అప్సరాశ్వరా' తెలియనివారై వుంటారా

ప్రతిభ అనేది దేశకాల నియంత్రితం కాదు కదా!

వీరు పోతనగారి జీవితమును వస్తువుగా స్వీకరించి కావ్యమొనరించినట్లూ, తద్ద్వారా ప్రశస్తి వల్ల అ ప్రాంతంలో " అభినవపోతన " బిరుదాంకితులుగా ప్రసిద్ధులైనట్లూ, ఈ సంపుటి పీఠిక వల్ల తెలుస్తున్నది.

అది బయటికి వచ్చి వీరి సత్కీర్తిని అనగాహాని చేసికోగల అవకాశాన్ని ఆంధ్ర రసజ్ఞులు కల్పింతురుగాక యని ఆశింప

## ర క్తా క్షి

శ్రీ పోచుగుంటర్ ప్రతులకు రచయిత కళాశాలి పల్లికవన్న పాములకోట తూర్పుగోదావరిజిల్లా. వెల తెలియదు

'రక్తాక్షి' ఖండకావ్య సంపుటిలో మూడు భాగాలున్నాయి. మొదటి భాగంలోని పద్ధతి 'అభ్యుదయ' ధోరణిలో ఖండకావ్యాలు రెండవ భాగం

కూడా ఇలాగే సాగిపోతుంది. మూడవభాగం పద్య నాటికా భ్రాంతి గొలిపే ఖండకావ్యసముదాయం.

మొదట భాగంలోని ఖండికలు చాలావరకు 'అభ్యుదయ' రచనలు. రెండవభాగం మూడవ భాగం కొంత నాతిపథంలో సాగాయి. మూడవ భాగంలో కీర్తికాముకుంగా అక్కడక్కడ అభ్యుదయ ధోరణి కనిపించినా ప్రాచీనార్ష సంప్రదాయాలు, ఆదర్శాలు, ఎడనెడ ప్రత్యక్షమౌతూంటాయి.

ముఖ్యంగా ఈ భాగంలో రచయిత కొత్తకొత్త ఛందస్సులు వాడి, అవి చాకచక్యంతో నిర్వహించారు. దీనికి క్రింది రచన తార్కాణ. ఇది 'విప్లవం' అనే శీర్షికలోని రచన

'తనయులను కాంచి మన
మనసులు చలించినవి
జనముల విషాదకర
వివిధ హృదయమ్ముల్
కదలినవి శోకమున
..
కనిపినవి కార్యమున
జనకు భువనమ్ముల్ !'

దీనిమీద అభిప్రాయం వెలిబుచ్చిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు అన్నట్లు ఈ కావ్యంలోని నూతనాకారం చాలా దురూహంగా ఉన్నది. ఆ వర్ణితములు, అస్పష్టములు అయిన సాంకేతికపదాలు వాడడమే ఈ అస్పష్టతకు కారణం. ఎంతో సహనంతో పరిశీలిస్తే తప్ప ఈ రచన అంతరార్థం బయటపడటం కష్టం.

ఈ కావ్యం రచయితకు గల ప్రాచీనాధునాతన భావాల మీది అభిమానం నిగూఢంగా వ్యక్తం చేస్తున్నది. అయితే ఇది అభ్యుదయదృక్పథం అభిరూపించే రచన

'శాస్త్రి'



## నాటికా గుచ్ఛము

శ్రీ వి. రామకృష్ణరావు. టీచర్, జయహింద్ సెకండరీస్కూల్ మచిలీపట్నం వెల ఒక రూపాయి.

దీనిలో 1 అడవి పుష్పాలు, 2 ప్రాత క్రొత్తలు 3 స్నేహఫలం, 4 అనుకోని ఆనందం, 5 కాలభటుడు అని 5 నాటికలున్నాయి

ఈ రోజుల్లో పాఠశాలల్లో విద్యార్థులు ప్రదర్శించడానికి అనువయిన చిన్న చిన్న నాటికలు చాలా స్వల్పంగా ఉన్నాయి.

అంతగా వ్యయ ప్రయాసలు లేకుండా స్వల్పవ్యవధిలో విద్యార్థులు సులభంగా ప్రదర్శించుకోడానికి అనువయిన నాటికల గుచ్ఛమిది.

## పురమందిరము

శ్రీ వి. రామకృష్ణరావు, టీచర్ జయహింద్ సెకండరీస్కూల్ మచిలీపట్టణం వెల ఒకరూపాయి.

ఇది పాఠశాల విద్యార్థులేకాక తదితరులుకూడా ప్రదర్శించడానికనువయిన సాంఘిక నాటకం. దీనిలో రచయిత సందర్భానుసారంగా పద్యాలేకాక పాటలు కూడా చేర్చారు. గ్రామసేవాభిలాష, కళాభిమానము మున్నగు విషయాలపై అభిమానం పెంపొందించే లక్ష్యంతో ఈ చిన్న నాటక రచన సాగింది.

## నీవు—నేను

శ్రీ గోటేటి సత్యనారాయణమూర్తి పండ్యాల వెల లేదు.

ఇది ప్రాంజలి, ప్రార్థన, ప్రియతమునకు మొదలయిన 15 ఖండకావ్యాల సంపుటి. దీనిలో కథాఖండకావ్యాలుకూడా ఉన్నాయి.

ఈ కావ్యాలలో అంతటా ధారాశుద్ధి, సంస్కృతాంధ్ర పాండిత్యం, సంప్రదాయ విజ్ఞానము అనుస్యూతంగా గోచరిస్తున్నాయి.

Printed & Published For Nagaswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1 Editor S. Sambhu Prasad